# రామయ్య సంసారం

[ నాటికలు ]

"హరికిషన్"



సుబ్బరాయ పబ్లికేషన్స్
నర్రావారి వీధి :: సత్యనారాయణపురం
విజయవాడ - 2

# పరిచయ వాక్యాలు

జాతియొక్క సంస్కృతి కళాభ్యుదయంలో ప్రతిబిం బిస్తుందని నుడి. వాడుక భాషకు కావ్యస్థాయిని చేకూర్చిన గురజాడవారి "కన్యాశుల్కం" మొదలు ఈనాటివరకు అనేక నాటకాలు వెలువడ్డాయి. ఆంధ్ర నాటక కళాపరిషత్తు పోటీలు నిర్వహించటం, అనేక యితర సంస్థలు అదేవిధంగా పోటీలు ఏర్పాటు చెయ్యటం ద్వారా అనేక ఔత్సాహిక నాటక సంఘాలు క్రొత్త నాటకాలు ప్రదర్శించటం, రోజు రోజూ క్రొత్త నాటకాలుకోసం సమాజాలు అన్వేషించటం జరుగు తోంది.

"రామయ్య సంసారం" "పందిరిగుంజలు" రెండూ చక్కని నాటికలు. రంగస్థల ప్రదర్శనానికి ఉద్దేశించబడినవి. ఇలాంటి చక్కని నాటికల్ని అందజేసిన రచయితకు ధన్య వాదాలు. వీరు నాటక రచనలో ఇదే ఉత్సాహం, ప్రతిభ యికముందుకూడా చూపించి, ఔత్సాహిక నటులకు సాయ పడతారని ఆశిస్తున్నాను.

విజయవాడ,
20–9–59.

ఇట్లు,
వి. రామన్న పంతులు.

# ముందుమాట

ఈ రెండు నాటికలూ వ్రాసి కొద్దికాలమే అయినది. రంగస్థల ప్రదర్శనకు రెండూ ఉపయోగించేవే. ప్రతి మాట లోనూ ప్రాముఖ్యత ఉన్నది.

ముఖ్యముగా రెండవ నాటిక "పందిరిగుంజలు"లో గమనించవలసిన విశేషం వున్నది. స్టేజీ అలంకరణలో విశిష్టత చూపాలి. మూడు వంతులు స్టేజి ప్రకాశం గదిగానూ, నాలుగో వంతు వీధిగానూ చూపాలి. స్టేజి అలంకరణ ఆరీక్రిగా వుండాలి. గదికీ, వీధికీ మధ్య గోడ ఒక పెద్ద ఎత్తుగల స్క్రీన్ పెట్టుకోవచ్చు. కాని స్టేజిముందు కొసవరకు స్క్రీన్ వుండకూడదు. ఉంటే ఒకవైపు ప్రేక్షకులకు స్టేజి అంతా కనుపించదు. అంటే స్క్రీన్ కూడా మూడోవంతు పొడుగే వుండాలి. మిగిలిన భాగంకూడా గోడ వున్నట్లుగానే భావించి ప్రకాశం గదిలోనే యాక్ట్ చెయ్యాలి. స్క్రీన్ దాటి రాకూడదు. అందుచేత పరిధిలోనే నటించాలి. ఎందుచేతనంటే స్టేజిలో నాలుగవవంతు వీధికనుక.

స్క్రీన్‌కి ఒంటిరెక్క వాకిలి వుండాలి. బికారి (రామకోటి) వచ్చినప్పుడు తలుపు పక్కగా ప్రేక్షకులకు కనుపిస్తూ వుండి, రాజారాం, సుజాతలకు కనుపించకుండా కుర్చీలో కూర్చోవాలి. రాజారాం, సుజాతలు కూడా బికారిని చూడకుండా చాలా జాగ్రత్తగా నటించాలి.

ఈ నాటికలు ప్రదర్శించ బోయేముందు ప్రదర్శకులు నాకు తెలియపరిస్తే చాలు.

ఈ నాటికలు రెండూ చదివి తమ అమూల్య అభిప్రాయాలను, సలహాలను యిచ్చి నన్ను ప్రోత్సహించిన సినీ నటులు శ్రీ రామన్న పంతులుగారికి నా హృదయ పూర్వక వందనములు.

'హరికిషన్'

—(o)—

# శ్రీ వేంకటేశ్వరాయ నమః

ఏడుకొండలస్వామీ ఏడుద్వారాలవెనక
నల్లనిరూపంలో నామాల తెలుపులో
మముగాంచిచూచేవా మా బాధలుతీర్చేవా

ప్రభాతసమయాన నీదర్శనంకొరకు
నిద్రలేపోలేదు ఆస్పత్రంలోన
తోమాలసేవలతో మనస్సునేదోచావా
నామాలదేవయ్యా నల్లనివాడయ్యా ||ఏడు||

నీ సహస్రనామంతో సకలజనులందరూ
సంతోషకరంగానే నీముంగిట్లోవున్నారు ||ఏడు||

ధర్మదర్శనంకోసం దీనజనులందరు
దూరాననుంచొచ్చి ధైర్యంగాఉన్నారు
వార్ని కాపాడరావయ్యా
నామాలదేవయ్యా నల్లనివాడయ్యా ||ఏడు||

పవళింపుసేవల్లో పాల్గొనుటకుమేము
పరుగెత్తివచ్చాము పవళించరావయ్యా
పద్మావతీదేవి అలకొచ్చిపోగానే
మముబ్రోచుటకునీవు యిక్కడేఉన్నావా ||ఏడు||

---

# అంకితము

కళారాధకులు, ప్రఖ్యాత సినీనటులు

## శ్రీ కె. వి. యస్. శర్మగారికి

ప్రేమ పురస్సరంగా

— రచయిత

---

# 'ప్రబోధగీతము'

సంఘమంటే సంస్థకాదోయ్
సంఘమంటే మనుష్యులోయ్ !

సంఘమును తీర్చిదిద్దగ
బాసచేసి నడుంకట్టి
రాతిగుండెల కరగింపజూచి
సంఘశ్రేయసుకు పాటుబడవోయ్ ॥సంఘ॥

సంఘమే నీ స్వంతమనుకొని
స్వంతముగ పనిచేయవోయ్
స్వంత ఇల్లే దిద్దుకొని
స్వార్థపరులను దరిచేర్చకోయ్ ॥సంఘ॥

సంఘబలమే అర్థబలమోయ్
సంఘసంస్కరణకు పూనుకోవోయ్
సంఘమంటే చీదరించే
స్వార్థపరులను చాటవోయ్ ॥సంఘ॥

సంఘమేమన ప్రజారాజ్యం
సంఘశ్రేయసె రామరాజ్యం
సంఘమునే తిరస్కరించే
స్వార్థపరులను మార్చవోయ్ ॥సంఘ॥

[హక్కులు రచయితవి]

# రామయ్య సంసారం

## [ నాటిక ]

### పాత్రలు

| | | | |
|---|---|---|---|
| రామయ్య — | వయస్సు | 55 సం॥ | గృహ యజమాని |
| రంగారావు — | ,, | 45 సం॥ | రామయ్య బావమరిది. |
| గోపాలం — | ,, | 20 సం॥ | రామయ్య కుమారుడు |
| సుబ్బారావు— | ,, | 22 సం॥ | రామయ్య మేనల్లుడు (వెర్రిబాగులవాడు) |
| ప్రభాకరం — | ,, | 24 సం॥ | గోపాలం స్నేహితుడు |
| వెంకాయమ్మ— | రామయ్య భార్య | | స్టేజి మీదకు రారు. |
| సరస్వతి — | ,, కుమార్తె | | |

[రామయ్య యింట్లో హాలు. ఒక డ్రాయరు, రెండు కుర్చీలు. డ్రాయరుమీద ఏవో కొన్ని పుస్తకాలు, గోడలకు యిద్దరు నాయకుల ఫొటోలు, రెండు దేవుళ్ల పఠాలు, రెండు క్యాలండర్లు, గోడకు ఒకమూల చాపచుట్ట ఆనించి వుంటుంది. డ్రాయరుమీద గడియారం టిక్కు టిక్కుమంటూ ఉంటుంది. రెండు ఎదురు వాకిళ్లు. వాకిళ్లకి కర్టెన్లు]

[తెర ఎత్తగానే రామయ్య కుర్చీలో కూర్చుని కళ్లద్దాలలోంచి క్రిందికీ పైకి చూస్తూ ఏవో పుస్తకాలు వెతుకుతూ వుంటాడు]

రామ: ఆకాలంలో, నేను హైస్కూల్లో చదివేరోజుల్లో పుస్తకాలు మాయకుండా ఎంత జాగ్రత్తగా సర్దిపెట్టుకునే వాళ్ళం. ఈకాలంవాళ్ళు ఏం లేదు. కాలేజీనుంచి రాగానే పుస్తకాలు గుమ్మంలోంచే విసిరేసి పోతారు.

[గదిలో భార్యవైపుచూస్తూ] ఏమన్నావ్ ! అవున్లేవే మావి వానాకాలపు చదువులు, నీ బిడ్డలవి ఎండా కాలపుచదువులూనా. అవును నిజమే ! ఎండాకాలపు చదువులే. అందుకనే అయ్యలకి చదవలేక చమటలు పట్టిపోతున్నాయ్ [అటూ యిటూ చూసి] ఏడీ ! ఎక్కడకు వెళ్ళాడా వెధవ...ఏమిటి ! ఓయబ్బో ! వెధవంటె తప్పొచ్చిందాఏం ! [కాస్త గుమ్మంవద్దరకు వెళ్ళి మెల్లిగా] ఓసి పిచ్చిదానా ! పిల్లలమీద నాకు ప్రేమలేకకాదే వెధవ అంటే వేద్యోళ్ళ ధనముతో వర్ధిల్లుగాక అని అర్ధం. [ఎదురువాకిలివైపు చూసి] అమగో వస్తున్నారు దొరగారు [గుమ్మం అవతలకు వెళతాడు.]

[గోపాలం కోటు బుజానవేసుకుని వస్తాడు. వెంట స్నేహితుడు ప్రభాకరంకూడా వస్తాడు.]

గోపా :- [తండ్రిని చూడకుండా] రారా ప్రభాకరం రా. ఇదే మా బెడ్రూం అనుకో, డ్రాయింగురూం అనుకో, పెద్దహాలనుకో. ఏంచేస్తాంచెప్పు బ్రదర్.

ప్రభా:- ఫరవాలేదులేవోయ్. మధ్యతరగతి కుటుంబీకులు ఎట్లావుంటారు చెప్పు. యిప్పటికే అయిదోవంతు సంపాదన అద్దెలకు పోతుంది.

గోపా:- చూడవోయ్ నా పాతసూట్లూ నేనూ. ఇవి పాత కాలపురోజు లనుకుంటున్నాడు మానాన్న. ఆయన చదివేరోజుల్లో గోచీపెట్టుకున్నా రానిచ్చేవాళ్ళు బళ్ళోకి. ఏమంటావ్?

ప్రభా:- నిజమేనోయ్. మా Father తోనూ యిదే ట్రబులు.

గోపా:- అవును. ప్రపంచం పురోగమనం ఈ పాతకాలపు వాళ్ళు అర్థంచేసుకోలేరోయ్. కాకపోయినా అసలు కల్చరనేది పుటకలోనే రావాలి.

ప్రభా:- అట్లాంటే నేను వప్పుకోను. ప్రతివాడు సంఘంలో మసులుకుంటూ చూసి నేర్చుకోవటంలోనే ప్రతిభ చూపించాలి.

గోపా:- Yes, You are correct కాని మానాన్న...చాలా...

[మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ రామయ్య వస్తాడు.]

గోపా:- [తండ్రిని చూడగానే కొంచం తెప్పరిల్లి] ఎంతసేపయింది నాన్నగారూవచ్చి. యింతవరకూ యింట్లో లేరనుకున్నారా. [ప్రభాకరాన్ని చూపి] యితను మా క్లాస్ మేట్ ప్రభాకరం.

ప్రభా:- నమస్కారం బాబుగారు.

రామ:- మీరు చెప్పిందంతా నిజమేరా. మేం గోచీపెట్టుకునే చదువుకున్నాం. గుంట ఓ, న, మఃలు దిద్దుకున్నాం. ఈకాలంలో వాళ్ళకి ఓనమాలు రాయటానిక్కూడా పార్కరుపెన్ను కావాలి.

గోపా:- ఏదో మేం నవ్వులాటకి అనుకుంటున్నాం నాన్నా. అంతే.

ప్రభా:- బాబుగారూ! చూడండి! ఈరోజుల్లో పొట్టకన్నా డ్రస్ చాలాముఖ్యం.

రామ:- అవును నిజమే. యింట్లో బియ్యం లేకపోయినా ఫరవాలేదు. పక్కవాళ్ళు అప్పిస్తారు. కాని పౌడరు,

స్నో బాటిలూ లేంది ఒక్క పూట జరగదు. అప్పటి కష్టాడు కొనుక్కురావాలి. పిదపకాలం.

గోపా:- అవున్నాన్నా. కంటికి యింపుగా వుం టేగాని కడుపుకి యింపుగా వుండదన్న సామెత ఊరికేవచ్చిందా.

ప్రభా:- నేవస్తారామరి. వెళ్ళొస్తా బాబుగారూ [వెడతాడు.]

గోపా:- [తల్లినై పుచూస్తూ] ఏమిటమ్మా అంటున్నావ్... నువ్వా నాన్నమాదిరే మాట్లాడితే ఎట్లాగమ్మా. మన సమా ఏమంటుందో తెలుసా నాన్నా. మనిషికి అలంకారమే ఆరోగ్యం అంటుంది. మీారేమంటారు చెప్పండి.

రామ:- [భార్యతో] చిన్నవాళ్ళమాటలకేం లేస్దూరూ అని సాగదీసుకుంటున్నావే అంతా నీ ట్రయినింగే నే. నన్ను కాల్చుకుతినండి.

గోపా:- అవునమ్మా నువ్వు మాతరపునే మాట్లాడాలి.

రామ:- అంతేలేరా. ముందొచ్చిన చెవులకన్నా వెనకొచ్చిన కొమ్ములువాడి అని ఊరికేవచ్చిందా సామెత. కట్టు కుని ముప్ఫయి అయిదేళ్ళు కాపురంచేసిన మొగుడు పోయాడు. నిన్నగాక మొన్న పుట్టిన వీళ్ళమాటలు వినాలి...అదేమిటే కళ్ళనీళ్ళు పెట్టుకుంటావ్.

రంగా:-...........

రామ:- [నవ్వి] ఓసి నీయిల్లు బంగారంగానూ భలే తెలి వయినదానివే నే. ముప్ఫయి అయిదేళ్ళు కాపురం చేసిన మొగుడుపోయి అంటే నేను పోయినానని అర్థం చేసుకున్నావా. ఓసి పిచ్చిదానా, నావన్నీ వాగా

యిత్త్యం మాటలా? ఓసిదద్దమ్మా చదివేస్తే ఉన్నమతి పోయిందని, యిదా నువ్వు అర్థంచేసుకున్నది. శుక్ర వారంపూట యివేం మాటలంటావా. నేను చావనే పిచ్చిదానా చావను. [కొడుకుతో] చూశరా మీఅమ్మ తెలివి.

గోపా:- పోనీలేనాన్నా. అమ్మకు ఏదో మనస్సుకు కష్టం తోచిందే అనుకో; అయినా మీకు మరీ కొట్టించటం దేనికి.

రామ:- ఓయబ్బో! ఎంత ఆపేక్ష అమ్మమీద. ఈగను కూడా వాలనియ్యడు. ఈ ఆపేక్ష ఎన్నాళ్ళులే. నీకూ ఓ బొమ్మరాగానే ఈ అమ్మా, అప్పలగత్తె బొమ్మ లాగే.

గోపా:- నాన్నా! ఏమిటిదంతా? అసలు నాకు పెళ్ళే అక్కర్లేదు.

రామ:- ఒరేయ్! నువ్వు నాకొడుకువికదూ. ఆరోజుల్లో మీ అమ్మను చూడకమునుపు నేనూ యిట్లాగే అనేవాడ్ని మా నాన్నతో. కాని ఏంచేస్తాం [భార్యని చూపిస్తూ] నాపాలిట ఆజన్మగ్రహమై కూర్చుంది.

గోపా:- [విసుగుతో చూస్తాడు.]

రామ:- ఎందుకురా అంతవిసుగు. సరేగాని కాలేజీ వదిలాక యిప్పటిదాకా ఎక్కడికి దయచేశావు.

గోపా: కాలేజీలో నాటకాలుంటే అక్కడ కూర్చున్నాను.

రాము:- ఎవరెవరు వేస్తున్నారేం. హరిప్రసాదరావు, సురభ నాయుడు, శ్రీనివాసులు......వాళ్లువేసే నాటకాల మాదిరేనా?

గోపా:- [నవ్వి] పోనాన్నా. మా కాలేజీలో వార్షికోత్స వాలు జరుగుతున్నాయి. బీద విద్యార్థినిధికి యివాళ బెనిఫిట్ పెర్ఫారమెన్సు పెట్టాం. టిక్కెట్టు రెండేసి రూపాయిలు.

రాము:- రెండేసి రూపాయిలే! మాచిన్నప్పుడు గుబ్బి వీరన్న, సురభి కంపెనీలుండేవి. లంకాదహనంలో ఆంజ నేయులు నిజంగానే తోకకి నిప్పంటించుకుని లంకను తగలబెట్టేవాడు. కురుక్షేత్రంలో నిజంగానే తెల్ల గుర్రాల రథం యుద్ధరంగంలోకి వచ్చేది. కాలం మారిపోయింది.

గోపా:- అవన్నీ పాతకాలం పద్ధతులు నాన్నా. ఇప్పుడు వేశే వన్నీ కల్చరల్ ప్రోగ్రాంసు.

రాము:- (భార్యవైపుచూస్తూ) నీకు గుర్తుందిటే మనపెద్దమ్మా యిని కడుపుతో వున్నప్పుడు కురుక్షేత్రానికి వెళ్లాం. అదేలే పాతిక ముప్పై యేళ్లనాటిసంగతి. (కొడుకుతో) నాకు బాగా గుర్తుందిరా. అప్పుడు రెండు రూపా యిల టిక్కెట్టుపెట్టి మేమిద్దరం వెళ్లాం. దానికా వేవిళ్లు (భార్యనుచూసి) చెప్పమంటావుటే.

గోపా:- ఏంజరిగింది నాన్నా?

రాము:- (నవ్వుతూ) అదే కురుక్షేత్ర నాటకం. యుద్ధ రంగంలో అర్జునుడుకి కృష్ణుడు గీతోపదేశం చేస్తాడు.

ఆ సీనుచూసి నిజంగానే కృష్ణుడనుకుంది మీ అమ్మ. హే కృష్ణపరమాత్మా ఈ గండం గడిచి బయటపడి సుఖంగా తేలిగ్గా పురుడు పోసుకుంటే నీపేరు పెట్టుకుంటాను, అని మొక్కుకుంది ఆ హాల్లో విరిగిపోయిన బెంచీమీద కూర్చునే. ఏదో పాపం ఆదుర్దాకొద్దీ మొక్కుకున్నదే అనుకో.

గోపా:- తరువాత ఏంజరిగిందమ్మా?......నాన్నగార్నే చెప్పమంటావా? సరే. నువ్వేచెప్పు నాన్నా.

రామ:- నువ్వొద్దంటేమటుకు ఊరుకుంటానేం. చెప్తోత్తాను. ......చెప్పకోండీ అని మూతి ముడుచుకున్నావే. నీ అయోమయానికి యిదింకో నిదర్శనం అని చెప్తున్నా. ఆపాళంగా నాకో సందేహం కలిగిందిరా. నీపేరు పెట్టుకుంటానందే, అది శ్రీకృష్ణ భగవానుడి పేరా? లేక కృష్ణుడువేషం వేసిన నటేశయ్యారు పేరా అని.

గోపా:- బలే సందేహం నాన్నా ...... ఏమిటమ్మా ...... అట్లా అడగరా అంటున్నావా. ఆతరువాత నాన్నా?

రామ:- ఏముంది. సుఖంగా కన్నది. ఆడపిల్ల. అందుకనే దానిపేరు కృష్ణవేణి అని పెట్టుకున్నాం.

గోపా:- చాలా బావుంది నాన్నా.

రామ:- ఆఁ యింతకీ ఏంచెబుతున్నావ్?

గోపా:- అదే కాలేజీలో నాటకం సంగతి.

రామ:- యింతకీ రెండు రూపాయిలూపెట్టి టిక్కెట్టు కొన్నానన్నావ్. అంతేనా?

గోపా:- అవున్నాన్నా. అమ్మనడిగి రెండు రూపాయిలు తీసుకున్నాను. నాటకం చాలా బావుంది నాన్నా.

రామ:- అంటే బిళ్ళగుడుములట్లే రెండు రూపాయలూ బాగుండలేదంటావ్. అంతేనా?

గోపా:- కాదునాన్నా. ఏదో మా కాలేజి డ్రామా. కాస్త సలుగురిలోనూ ఉన్నాననిపించుకోనేవాడ్ని. ఆమాత్రం కొనకపోతే అది నీకూ......

రామ:- నామర్దా కాదా అంటావ్. అంతేనా [ భార్యతో ] ఏమిటే నీగోలుగుడు పోనీ నువ్వో వెళ్ళకపోయావ్ యింకో రెండు రూపాయలు తీసుకున్నా. దొరికాను అంతా. నాప్రాణం తియ్యటానికి.

గోపా:- ఎందుకు నాన్నా అంతకోపం? కాలేజీలో చదువుతూ కాలేజి నాటకాలకు వెళ్ళకపోతే ఏంబావుంటుంది నాన్నా. మీరేచెప్పండి.

రామ:- నిజమేరా గోపీ! నేను రిటయిరయ్యానన్న సంగతి తెల్సుకద. ఎందుకురా ఆ దుబారాఖర్చు చెప్పు. అక్కర్లేదు కనుక మగపిల్లవాడయితే నాకు చేతికి అక్కరకొచ్చేవాడేనా. అదే ఆడపిల్ల కావటంనుంచీ మీరింకా చిన్నవాళ్లు కావటంనుంచీ, నే రిటయిరయినా, యింకా మీకు జీతాలు కట్టి చదువులు చెప్పిస్తున్నాను. ఇంకా సరస్వతికి పెళ్ళిచెయ్యాలా. దానికీ పద్దెనిమిదోఏడా, ఈ సంసార పరిస్థితులన్నీ నువ్వో అర్థంచేసుకోవాలిరా గోపీ. ఎల్లకాలం చిన్నతనమయితే ఎట్లాచెప్పు.

గోపా:- నిజమేనానాన్నా! ఏ వయస్సులో ముచ్చట్లు ఆవయస్సులో జరుపుకోవాలనే మానవ సహజమయిన కోరిక ప్రతివాడికీ ఉండదా నాన్నా చెప్పండి. అయినా నేమటుకు రోజూ నెడతానా. మన సంసార బాధ్యత నాకుమాత్రం తెలీదానాన్నా.

రామ:- ఆమాత్రం ఆలోచనవుంటే యింకా లేందేముందిరా. (భార్యనుచూచి) చూశావుటే! నీ కుమారరత్నం మాటలు. అంతా నీ ట్రయినింగే. మాటలకు మాత్రం తడుముకోడు.

గోపా:- (తల్లితో) నాన్నగారు రిటయిరయారనీ, సరూకి పెళ్ళి చెయ్యాలనీ, అన్నీ నాకు తెల్సునమ్మా. కాని ఈ కోరికలున్నాయి చూశావ్......వాటి దుంప తెగ.

రామ:- సరే యింతకీ నీ కనీసపు కోరికలు ఒక్కటి చెప్పు చూద్దాం. . . .

గోపా:- నాన్నా! సరైన సూట్లు నాలుగు కూడాలేవు. కనీసం రెండైనా కొత్త సూట్లుకావాలి.

రామ:- అదా ఈ ఉపోద్ఘాతానికి నాంది ప్రస్తావన. అంటే సరికాని సూట్లు నాలుగుకన్న ఎక్కువే వున్నాయన్న మాట. వాటిలో సరయినవి రెండు తీసుకుని బాగు చేయించుకో.

గోపా:- ఏమటినాన్నా! మరీ యిదిగా మాట్లాడతారు. రేపు యింటర్ కాలేజీయేట్ టోర్నమెంట్సుకిఎట్లా వెళ్లాలి ఈ పాతరకం బట్టలతో.

వెంకా:- ............

రామ:- పోనీ కష్టించండి అని సాగదీసుకుంటున్నావే. నీతాత ఎవరిస్తారే డబ్బు? (సరస్వతి తల్లిదగ్గర కొస్తున్న అలికిడి) అదుగో నాచిట్టితల్లి. దానిపెళ్లి కాందే యిలాంటి దండుగకర్చులు ఏవీ చెయ్యను. ఏవమ్మా ఎక్కడికి వెళ్లావ్?

సర:- .........

రామ:- ఓహో సంగీతానికి వెళ్లొచ్చావా? మర్చిపోయాను. (కొడుకుతో) చూడరా. నీకన్న చిన్నదయినా ఎంత మెలుకువగలదో అది. కాలం వృథాచెయ్యకుండా ఏదో ఒకవిద్య నేర్చుకుంటున్నది.

గోపా:- అవున్లెండి ఆ మతిలేని మేనల్లుడికేగా మీరిచ్చి చేసేది? ఆ వెఱ్ఱివాడికి సంగీతం తప్పకుండా కావాలి.

రామ:- ఏమన్నావ్! సుబ్బారావు వెఱ్ఱిబాగులవాడా? వాడి అరికాల్నున్న అదృష్టం............

[ రంగారావు, సుబ్బారావు వస్తారు ]

రంగా:- హల్లో బావగారు, How do you do! ఏమిటో అరి కాల్న అదృష్టమంటున్నారు?

సుబ్బా:- నమస్కారం మావయ్యా. ఏంబావా క్షామమా? తప్పు తప్పు క్షేమమా?

గోపా:- కాదు మరీ! నువ్వు అడుగుపెడితే చాలు అంతా క్షామమే.

రామ:- ఏడిశావ్‌గాని, నోరుముయ్. ఆఁ ఏంస్వామీ! ఇట్లా దిగారు కుమారరత్నంతోకూడా?

సుబ్బా:- తల్లి లేని పిల్లాణ్ణికాదు మామయ్యా! అందుకని తోక తోక నారాయణా అంటూ నేనూ వచ్చా.

రామ:- అవును. మరీ పసిపిల్లాడివి. పాలుకూడా పొయ్యాలా?

రంగా:- ఏం బావగారూ! రిటయిరయ్యాక చాలా తేలిగ్గా వున్నట్లున్నారు? (అటుచూసి) ఏం అక్కగారు! కులాసేనా? ఏదీ సరస్వతేదీ?

సుబ్బా:- నాన్నా! అదుగో స...స...స

గోపా:- [ హాచ్చి అని తుమ్మి ] ఆఁ. సంగీతం నేర్చుకుంటు న్నావా బావా! స స సా అంటున్నావ్.

సుబ్బా:- ఏం తప్పా? నేర్చుకుందాం. అందు కేగా వచ్చింది.

రంగా:- ఒరేయ్ నువ్వూరుకో. ఏం బావగారూ ఏమిటి విశేషాలు.

రామ:- ఏమున్నాయ్ బావగారు. మాబోటి లేనివాళ్లు రెండు పూట్లా తింటుంటె, మీబోటి లక్షాధికార్లు ఒక్క పూటే తింటున్నారు.

సుబ్బా:- తప్పు తప్పు. రెండులక్షల అధికారి మానాన్న.

రంగా:- ( మీసం మెలేస్తూ ) చూశారా బావగారూ! మావాడి చమత్కారమూ, సమయానికి అనవరసిన మాటలపొందిక. అందుకనే మామా అల్లుళ్ళు అయితే యింక లేందేముంది. (గోపాలాన్ని చూసి) ఏం అల్లుడూ నీసంగతే మర్చిపోయాను. బాగా చదువు తున్నావా? చూడండి బావగారూ; అల్లుడు మాత్రం గుమాస్తా కాకూడదు. తెల్సిందా?

రాము:- నేనెంత, నా ఉద్యోగాలెంత; నగేలెండి కాళ్ళు కడుక్కోండి.

రంగా:- చూడండి అక్కగారూ; కాసిని వత్ప్రత్తునీళ్లు కలిపివ్వండి. ఏంకోడలుపిల్లా నువ్వయినా కలిపివ్వు. అబ్బో! అప్పుడే సిగ్గుపడుతున్నావే!

సుబ్బా:- ఏమిటి నాన్నా, చిన్నపిల్లలకి పనిచెబుతావ్ మరీను.

రంగా:- ఏం బావగారూ మావాడు చూశారూ అప్పుడే ఎంత మారిపోయాడో.

గోపా:- మారాడు. యింకా మారాడు. అవునుగాని, నీపరీక్ష పోయిందటగా సుబ్బా.

సుబ్బా:- (తలగోక్కుంటూ) పోతేపోయిందిలే బావా. మళ్ళా కొనుక్కోవచ్చు.

గోపా:- (నవ్వి) కొనుక్కోటమేమిటోయ్ బావా!

సుబ్బా:- అదే మళ్ళీ చదవొచ్చు. అయినా, నాకు చదువు...

రాము:- ఎందుకులే రెండు లక్షలు ఆస్తి ఉన్నవాడివి. హాయిగా కాలుమీద కాలువేసుకుని తినొచ్చు ఆ అయివేజుతో.

సుబ్బా:- భలేగా చెప్పావ్ మావయ్యా. నువ్వెప్పుడూ మేనల్లుడి తరఫే మాట్లాడాలి.

[ ఒరేయ్ గోపాలం అంటూ ప్రభాకరం వస్తాడు ]

ప్రభా:- ఒరేయ్! చుట్టాల సందట్లో ఉన్నావా?

గోపా:- వస్తున్నారా. మా మావయ్య, బావ వస్తేను మాట్లాడుతున్నా. మావయ్యా మళ్ళీ కలుస్తా.

[ గోపాలం, ప్రభాకరం వెళతారు ]

రంగా:- మేము వెళ్తాం బావగారూ. కాస్త పనుంది. వీడిని కూడా తీసుకువెళ్ళి, యిద్దరం మళ్ళీ రేపొస్తాం.

రామ:- భోజనం.

రంగా:- ఇంక యీపూట కాదు. స్నేహితులింటికి ఈపూట వెళ్ళి రేపొస్తాం. రారా సుబ్బా (యిద్దరూ వెళ్ళి పోతారు).

[ లైట్లు బాగా తగ్గి వెలుగుతాయి ]

[ లైట్లు వెలగగానే యిదివరకుమాదిరే ఉంటుంది. రామయ్య కుర్చీలో కూర్చొని కాఫీతాగుతూ వుంటాడు. గోపాలం వస్తాడు ]

రామ:- రాత్రి వెళ్ళి పొద్దుపోయొచ్చావ్. మళ్ళీ ప్రొద్దున్నే వెళ్ళోస్తున్నావ్. ఎక్కడికెళ్ళావురా?

గోపా:- (మాట్లాడడు)

రామ:- మాట్లాడవేంరా?

గోపా:- స్నేహితుడింటికి వెళ్ళాను.

రామ:- ఎవరోయ్ అంతప్రొద్దున్నే చూడాలొచ్చిన స్నేహితుడు? ఏమటూ రాచకార్యం? [ భార్యవైపు చూసి ] అబ్బబ్బా! నువ్వూరుకోవే. నీకెందుకీగొడవ? ఇదుగో వసేవ్ నువ్విట్లా అలుసివ్వటంనుంచే వాడిల్లా రెచ్చిపోతున్నాడు. ఏంరా! మాట్లాడవేం? అట్లా బెల్లంకొట్టిన రాయిలా కదలవేరా?

గోపా:- నేనూ, స్నేహితుడూ కలిసి స్టేషనుకువెళ్ళాం.

రామ:- ఎందుకో?

గోపా:- సినిమా యాక్టరు, ప్రముఖ నటుడు హారేశ్వరరావు లేడూ, ఆయన్ని మా కాలేజి వార్షికోత్సవాలకి ఆహ్వానించాము. వార్ని పంపించటానికి స్టేషనుకు వెళ్ళాం.

రామ:- చాలాదాకా వచ్చిందే వ్యవహారం. ఆ హారేశ్వర రావుకేం, లక్షలు సంపాయిస్తున్నాడు. అతనికీ, మనకూ పోటీరా? యిందుకేనా నువ్వు కాలేజీలో చేరింది? [కూతురుతో] అమ్మా, సరూ! వాడసలు కాలేజీలో చదువుతున్నాడా, ఈవ్యవహారాల్లో తిరుగు తున్నాడా?

సర:- ...........

రామ:- ఓహో, అట్లాగా! వాడు ఫోర్తు బియ్యే. నువ్వు పి. యు. సి. కాబట్టి క్లాసులగొడవ తెలీదంటావ్. అన్నకుతగ్గ చెల్లెలువే. ఒరేయ్! నిజంగా చెప్పు. ఈ వ్యవహారాలకు నీకు ఎంత వదిలిందిరా?

గోపా:- ఎంతో లేదునాన్నా. పది రూపాయిలు ......... అసలంతా కాలేజీవాళ్ళే కర్చుపెట్టారు.

రామ:-పది రూపాయిలు (విచారంతో) ఆ పది రూపాయిలూ పెడితే పీశన్నర నెయ్యి వచ్చేదికాదురా! ఎందుకురా నువ్వు కాలేజీలో చదవటం? ఒక్కగా నొక్కడివి. నన్నేదో ఉద్ధరిస్తావని గంపెడాశతో రిటయిరయి కూడా మీకు జీతాలుకట్టి, కాలేజీలో చదివిస్తు న్నారా. యిదేరా నీచదువు? నాన్నా రిటయిర

య్యాడు, జీతం రామకదా, ఈ సంఘగ కష్టాలు తగ్గించుకుందాం అనే జ్ఞానం ఉండక్కర్లేదురా? అంత కన్నా.........

గోపా:- క్షమించు నాన్నా. [ తల్లితో ] అవునమ్మా. మన పరిస్థితులు నాకూ తెల్సు. కాని......అమ్మా...... నలుగురితో పాటుగా మనమూ వుండాలని చేశాగాని, నాన్నని బాధపెట్టాలని కాదమ్మా.

రామ:- ఇంకా నాకు పెన్షనుకూడా రాలేదే. ఇకనుంచి సంసారం ఎట్లాగడుస్తుందిచెప్పు. ఆమాత్రం గ్రహింపు లేకపోతే ఎట్లాగురా నాయినా. అయిందేదో అయిపో యింది. మనం నలుగురం సంప్రదించుకుని Family Budget వేద్దాం. [ కూతురుతో ] ఏం బాగుందా సరూ యీ పద్ధతి? [ భార్యతో ] ఏమే, ఏమిటి నీ సలహా?

సర:- .........

రామ:- [ నవ్వి ] ఏమిటమ్మా సరూ, అమ్మని Finance Ministerగా వేస్తే మిగులుప్రాంతం అయిన పోపుల పెట్టెలోంచి డబ్బులు బైటికొస్తాయంటావా?

గోపా:- అదే బాగుంది నాన్నా. అమ్మ ఆర్ధికమంత్రి, మీరు హోం మినిస్టర్, నేను మినిస్టర్ ఫర్ External affairs మరి...... సరస్వతేమో......[ ఆలోచించి ] పోర్ట్ ఫోలియో లేని మంత్రి.

[ తండ్రి, కొడుకులు నవ్వుకుంటారు ]

రామః- సరే. కొత్త మంత్రివర్గం. అంతాకలిసే ప్రోగ్రాం వేద్దాం. ఆఁ ఒసేవ్ ముందు నీ అయిటమ్సు చెప్పు. ఏమిటీ? మడికట్టుకున్నానంటావా? పోనీ అక్కడనుండే చెప్పు.

గోపా:- ప్రయాణఖర్చులూ, భత్యాలక్రింద నెలకు పదిరూపాయిలు కావాలి.

రామః- [ కూతురితో ] ఏమిటెతల్లీ అంటున్నావ్? మైసూరు క్రేపుసిల్కు చీరెకు ముప్ఫయి రూపాయిలు కావాలంటావా? సరేనమ్మా- ఆఁ ఒక్క విషయం. ఈ పద్దుండే పెళ్ళిచూపులకి.........

గోపా:- పో నాన్నా. అని తుర్రుమన్నావే. అట్లా అయితే బడ్జెట్ ఎట్లా అప్రూవ్ అవుతుందే సరూ. నాన్నా అసలు అమ్మని చెప్పమనండి.

రామః- ఆఁ చెప్పవే. కూరల ఖాతాక్రింద పది రూపాయిలు, బియ్యం ఖాతా నలభై, బట్టలఖాతా సంవత్సరానికి మూడువందలు, ఆవాలు, జీలకర్ర, కాఫీపొడి, పంచదార, పాలు, పెరుగు వగైరాలకు అరవై కావాలంటావా. బాగుంది అసలు నీ పద్దే పెరిగిపోయిందే. ఏరా! యింత కావాలంటావా.

గోపా:- వేసెయ్ నాన్నా. వాటిల్లో తగ్గించుకుంటే ఎట్లా! ఆ బట్టల ఖర్చు క్రింద ప్రత్యేకించి నాకు యింకో యాభై వెయ్యి నాన్నా.

రామః- [కూతురుతో] ఏమిటమ్మాసలు నీక్కూడా ప్రత్యేకించి యింకో ఏభై కావాలంటావా; సరే. [అన్నీ

కూడుకుని]. రామచంద్రా; బడ్జెట్టు తలక్రిందులయింది. ఒసెవ్, నా కొచ్చే పెన్షను డెభై నాలుగు రూపాయిలు, ఆడబ్బు నీకేయిస్తా. అన్ని ఖర్చులూ నువ్వే చూస్కో. అన్నట్లు మామయ్యా, బావ యింకా రాలేదే.

గోపా:- [అటుచూచి] అదుగో వస్తున్నాడు. నూరేళ్లు ఆయుషు మామయ్యా నీకు.

సుబ్బా:- మరి నాకో బావా.

గోపా:- నీకూను. పోనీ యింకో అయిదేళ్లేస్కో.

రంగా:- ఏమిటి బావగారూ! ఏదో కాన్ఫరెన్సు పెట్టినట్లు న్నారు. అంతా యిక్కడే వున్నారే.

రామ:- నేను రిటయిరయ్యాకదూ. వచ్చే పెన్షను డెభై నాలుగు రూపాయిలు, Family Budget వేశాం.

రంగా:- బాగుంది. ఎంతయిందేమిటి. యింతకీ లోటు బడ్జెట్టేనా?

రామ:- అవును లేకపోతే ఈ రోజుల్లో మిగులు బడ్జెట్టు కూడానా. మొత్తం ఖర్చు రెండు వందలు పైనే. కనీసం నూటముప్ఫయి రూపాయిలు లోటు బడ్జెట్.

సుబ్బా:- ఏవయినా కొత్తపన్నులు వెయ్యకపోయూరా?

[అంతా నవ్వుతారు]

గోపా:- ఎవరిమీద వెయ్యమంటావు కొత్తపన్నులు?

సుబ్బా:- మ్చ్ మ్చ్, అవును. ఎవరిమీద వేస్తారు? సరే మానెయ్యండి.

[బయట 'పోస్ట్' అని కేక]

గోపా:- [ వెళ్ళి ఉత్తరం తెచ్చి తండ్రికిస్తాడు]
రామ:- చదువు.
గోపా:- [ కవరుచింపి ] అదే. మనరైతు వెంకటయ్య రాసిన ఉత్తరం.

"బాబుగార్కి సమస్కారములు. మీ పొలం బేరం పెట్టాను. కాని ఎవరూ ఎక్కరావటంలేదు. ఎవరయినా వచ్చినా ఎకరం పదిహేను వందలకన్న ఎక్కువ పలకటంలేదు. ప్రస్తుత పరిస్తితులు మీకూ తెల్సుకదా. ఆ ధరకు బేరం సెటిల్ చెయ్యమంటే చేస్తాను. మన ఊళ్ళోనే పెదనర్సయ్య గారి చినసూరయ్య ఆ ధరకైతే కొంటానన్నాడు. మీజాబు రాగానే బేరం సెటిలుచేస్తాను. లేదా మీరొకసారి వస్తే మంచిది. ఒకమాట, ఈ సంవత్సరం వ్యవసాయకర్చులు నే పెట్టిన పెట్టుబడి నూటపాతిక రూపాయిలు మీరునాకివ్వాలి. అది మాత్రం గుర్తుంచుకోండి".

ఇట్లు మీ రైతు, వెంకటయ్య.

రంగా:- ఎంతమోసం! మీ ఊరి పొలాలు అంతధర తగ్గినాయా బావగారూ? గత సంవత్సరం రెండు వేల అయిదువందలని మీరే చెప్పారుగా.

గోపా:- అదంతా వెంకటయ్య ఎత్తు. తెల్సిందా నాన్నా?

రామ:- ఏంచెయ్యను బావగారూ? గత్యంతరంలేదు. చిల్లర బాకీలే తొమ్మిదివందల పైచిలుకు వున్నాయి. పైగా ఈనెలనుంచి పెన్షను డెబ్భయినాలుగు రూపాయిలేగా. సంసారం ఎట్లాగడుస్తుంది చెప్పండి, ఏదో ధరకు అమ్మకపోతే?

గోపా:- అయి తేమాత్రం అంత తక్కువధరా? వీల్లేదునాన్నా. రెండువేల అయిదువందలకూ ఏమాత్రం తగ్గొద్దు.

సుబ్బా:- Yes! అంతే మామయ్యా.

వెంకా:- ......

రామ:- (భార్యతో) నువ్వూండవే. నీవనేమిటో చూసుకోక, ఈ వ్యవహారాల గొడవ నీకెందుకుచెప్పు? నోరు మూసుకుని అవతలకి దయచేయ్.

రంగా:- బావగారూ! ఆ వ్యవహారం ఏదో మీరే వెళ్ళి పరిష్కారంచెయ్యండి. సరే మీతో ఒక ముఖ్యమైన విషయం చెబుదామని వచ్చాం.

[ అంతా ఏమిటా అని చూస్తారు ]

రంగా:- సుబ్బుకి యిక అక్కడ చదువుకోటం యిష్టంలేదు. ఈ ఊళ్లో ఏదో ట్యుటోరియల్ కాలేజీలో చేరి చదువుతాట్ట. మీకూ కొంతబాధ్యత వుంది గా. నాకోసం కాకపోయినా, చచ్చి స్వర్గానున్న మీ చెల్లెలుకోరికయినా మీరు తీర్చాలిగా. వాడికీ మీ యింట్లో వుండి చదువుకోవాలని వుంది. ఏంఅక్కగారూ! ఏమంటారు? ఏంబావగారూ! ఏమిటి మీ ఉద్దేశ్యం?

రామ:- [ భార్యతో ] ఏమే ఏమంటావ్? అయినా నాదే ముంది బావగారూ. వండివార్చేది అదేగా.

గోపా:- [ కొరకొర చూస్తాడు ]

రంగా:- ఏం అక్కగారూ మాట్లాడరేం. చూడండి బావగారూ! యింకో సంగతి. నాకూ ఒక్కగానొక్క కొడుకు. నా ఆస్తి అంతా వాడికేగా. ఎప్పటికయినా వాడు...

గోపా:- ఆ విషయాలన్నీ ఇప్పుడెందుకు మామయ్యా. ఇంకా అందరిచమువులూ కావాలిగా.

సుబ్బా:- ఏమిటి బావా! పో నువ్వు మరీను.

రామ:- సరే అట్లాగే కానియ్యండి. బావగారూ. మాతో పాటు కలో, గంజో తాగి వాడూ యిక్కడేవుంటాడు.

రంగా:- అదీ విషయం. బావగారా మరేమన్నానా. అన్ని విషయాలూ నేచూసే చెడతా. మీరేమీ వాడ్ని గురించి బాధపడొద్దు. ఏం గోపాలం! నీకు యిష్టంలేదని నాకు తెల్సు. అయినా మీ బావకాదు, కాస్త వాడ్ని కలుపుకుని తిరుగుతూవుండు. సరే బావగారూ! నేంవెళ్ళి కాలేజీలో జీతంకట్టటం, పుస్తకాలు వగైరా విషయాలు చూసుకుంటాం.

[ రంగారావు, సుబ్బారావు వెళ్ళిపోతారు ]

గోపా:- నాన్నా! ఏమిటిదంతా? కాలిదితీసి నెత్తిన రాచు కోవటంగా వుంది.

రామ:- నీకు బాధ్యతలు ఏంతెల్సురా? పరిస్థితుల్ని బట్టి కాలానికి తలవగ్గటం నేర్చుకోవాలి. బావవుంటే నీకూ కాస్త సందడిగానే వుంటుందిగా.

గోపా:- అవును. యికనుంచీ అంతా సందడే. జీవితమంతా చీకటే.

[ అంటూ వుండంగానే ప్రభాకరం వస్తాడు ]

ప్రభా:- ఆ చీకటి వెనకాలే వెలుగూ వుంటుంది. అదే తెల్సుకో. చదువుకున్న వాడివి అన్నింటికీ అట్లా దిగులు పడితే ఎట్లారా.

రామ:- ఏమోయ్ ప్రభాకరం! కులాసా.

ప్రభా:- ఆఁ కులాసాయేనండి (రామయ్య లోపలికి వెడతాడు) ఏమిట్రా నీ ఆందోళన గోపీ!

గోపా:- నీకు తెలియందే ముందిరా. పేదవాళ్ళ కడుపున పెద్ద కొడుకై పుట్టేకన్న అడివిలో మానై పుట్టటం మంచి దంటారు. అదెంతవరకు నిజమోకాని, ఏకాకిమాదిరి ఒక్క కొడుకయితే మరీ బాధరా.

ప్రభా:- యిప్పుడేం పుట్టి మునిగిందేం?

గోపా:- ఏముంది మా వెఱ్ఱిబాగుల బావకి వాళ్ళ ఊళ్ళో చదువయి పోయింది. అంటే తప్పాడులే స్కూలు ఫైనలు. వాడిని యిక్కడ ట్యుటోరియల్ కాలేజీలో చేర్పిస్తున్నాడు వాళ్ళ నాన్న.

ప్రభా:- మంచిదే. చదువుకుంటాడు.

గోపా:- అది కాదురా బాబూ. వాడికి మా సరస్వతి నివ్వాలని ఆయన నిశ్చయం. యిక ఆలోచించు. నా కెంత మాత్రం ఈ సంబంధం ఇష్టంలేదు.

[రామయ్య వస్తాడు]

రామ:- అన్నీ విన్నానురా గోపీ. వాడి కేంతక్కువ. రెండు లక్షలు ఆస్థి. మనిషి బాగానే వుంటాడు. చిన్నవాడు. కొంచం వెఱ్ఱిబాగులవాడే అనుకో, చదువు తక్కు-

వంటావు. యిక్కడ ట్యుటోరియల్ కాలేజీలో చేస్తున్నాడుగా. వాడే ప్యాసవుతాడు.

గోపా:- ఆలోచించు నాన్నా. ధనహీన మయినా కావచ్చుగాని, వరహీనం మాత్రం కాకూడదునాన్నా. వాడా Failed S. S. L. C. సరస్వతా Pre - University చదువుతున్నది. యిదేనా నాన్నా! మీరు ఆలోచించింది.

రామ:- [విచారంతో] గోపీ! యింతకన్న మంచి సంబంధం యెక్కడ తేనురా? ఉన్న ఒక్కయకరం భుక్తికి తక్కువవటంచేతనేగా అమ్మచూపింది. అమ్మితే వచ్చే పది హేనువందలూ బాకీలకు పోను ఏముంటుందిరా! మిగిలినా, వుండే మూడునాలుగు వందలతో ఎంత గొప్ప సంబంధం తెస్తావురా గోపీ! నీదింకా ఉడుకు రక్తం. నాది కరుడుగట్టి, గడ్డకట్టుకు పోయిన రక్తంరా బాబూ! పుట్టెడు కష్టాలూ, బాధ్యతలు నెత్తినున్నా నేనెన్నడూ క్రుంగిపోలేదు. లేని సంతోషం తెచ్చుకొని కాలం గడిపాను. అక్కయ్య అత్తవారు దాన్ని ఎంత ఏడిపించారో, నన్నెంత పీడించుకు తిన్నారో నీకు తెలియదు. మీరంతా చిన్నవాళ్ళు. ఎటొచ్చీ నలుగురు పిల్లలు పుట్టింతర్వాతనేగా దాని కాపురం కుదుటపడ్డది. దాని పెళ్ళితోనే నాకు నడుం విరిగి పోయింది. ఎంతగోల చేశారు వాళ్ళని తల్చుకుంటే గుండె చెరువవుతుంది. అన్నవస్త్రాలకు లేకపోయినా ఫరవాలేదు. కాని బాబూ! ఈ రోజుల్లో ఆడపిల్లలు కలవాళ్ళనీ, అందులో నాలాంటి నిష్ఠ దరిద్రులకీ

రోజులు వెళ్ళవురా. యింత వయసొచ్చినా, నాకింకా ఈ బరువు బాధ్యతలు తీరలేదంటే నా మనోవ్యథ నీ కెట్లా తెలుస్తుందిరా. పసగత్తి పాలు త్రాగేకంటే నిల్చొని నీళ్లు త్రాగుట మేలని, ఆశకొద్దీపోయి, నా చిట్టితల్లిని మళ్ళీ అక్కయ్యా సంబంధం లాంటిది తెచ్చి కట్టబెడతానేమోనని కుళ్ళి కుమిలి పోతు న్నాను. బావంటే అంతా ఎరుగున్న విషయం. కొత్త బాధలు ఏమీ లేవు. యింతకన్నా చెప్పలేనురా గోపీ!

[విచారంతో వెడతాడు కాళ్ళీడ్చుకుంటూ]

ప్రభా:- మీనాన్నగారి ఆవేదన చూస్తుంటే నాకు కళ్ళల్లో నీళ్లు తిరిగినాయి. కన్నతండ్రి బాధ ఈ రోజున కళ్ళారా చూశాను.

గోపా:- అంతా గ్రహించావుగా. మా కాపురం ఇలాంటి సుడి గుణ్ణాల్లో పడి దారీ తెన్నూ లేకుండావుంది.

ప్రభా:- అయితే మీ బావంటే సరస్వతికి యిష్టంలేదా?

గోపా:- సరేమిరా యిష్టంలేదు. కాని మా నాన్న మాటంటే చాలా భయం. ఆయన మాట కాదనలేక ఏ అఘా యిత్యం చేస్తుందోనని నాకు భయంగా వుంది.

ప్రభా:- ఏమీకాదులే. సరే నే వెడతారా. వస్తూవుంటాలే అప్పుడప్పుడూ.

[తెర]

# 2

[తెర ఎత్తగానే అదే హాలు. కుర్చీలో కూర్చుని సుబ్బారావు పేకతో పేషన్సు ఆడుతూ వుంటాడు. ఆరీను రాణీముక్కనుచూస్తూ]

సుబ్బా:- రాణీ! వాణీ! అంటే ప్రియమైన [అటూ యిటూ చూసి] ప్రియమైనసరూ! నీవేణి ఎంత అందంగా వుంది. అసలునేను ట్యుటోరియల్ కాలేజీలో ఎందుకు చేరినట్లు. చదువు కోసమనా ఛా ఛా నిన్ను చూట్టానికి, నీతో మాట్లాడటానికి. కదూయిక్కడికి వచ్చింది. నాకేం డబ్బులేకనా హోటల్లో వుండక పోవటానికి. కూటికిలేని వాడిననా! అంతా నీకోసం, నీ ప్రేమ కోసం, కాని నువ్వుమాత్రం నాకేసి, ఒక్కసారయినా, పొరబాటునైనా, యాక్సిడెంటల్ గానయినా చూడవు, ప్రేమ గుడ్డిదన్నారు పెద్దలు. అందుకనే నేను నిన్ను గుడ్డిగా ప్రేమిస్తున్నాను.

[గోపాలం వస్తాడు]

గోపా:- ఏమిటిబావా ప్రేమంటున్నావ్.

సుబ్బా:- అబ్బే ఏ, వ, వంలేదు. ఊరికేనే పేక ఆడుతున్నాను. ఏదో చిన్న రిహార్సిల్. అంతే.

గోపా:- ఏమిటా నాటకం.

సుబ్బా:- నాటకమా ... (తడబడుతూ) ఏ, ఏ, సంలేమ ... ఊరికే నాలో నేనే అనుకుంటున్నా. అంతే.

గోపా:- శాస్త్ర వళ్ళు దగ్గరుంచి ప్రవర్తించు లేకపోతే పెప్పు సాఫవుతుంది.

వెంకా:- ......

గోపా:- [తల్లితో] ఏం అంటే. ఈ పిచ్చాడికి తోడు ప్రేమ పాఠాలు వల్లిస్తున్నాడమ్మా. అవున్లే పాపం. నాన్నగారి మేనల్లుడుకదూ; ఆ మాత్రం వెనకేసుకు రాకపోతే ఎట్లా? అయినా, నాదేముంది కట్టుకున్నమ్మా చుట్టుకున్నమ్మా వుంటే, మధ్యవచ్చినమ్మకి మతిపోయిందిట. ఏమిటో ఖర్మ.

సుబ్బా:- బావా! యింకెప్పుడూ యిట్లా మాట్లాడను బావా. నువ్వు నన్ను కేకలేస్తుంటే నా కెట్లాగో వుంటుంది. చూడు బావా! నన్ను కేకలెయ్యవుకదూ? నువ్వు చెప్పినట్లే వింటాను. మా అమ్మేగనుక బ్రతికుంటే...... [కన్నీరు పెడతాడు.]

గోపా:- [బాగా తగ్గి] అననుకాని, చూడు బావా! పెద్దవాడివయ్యావా; ఆ మాత్రం లోకజ్ఞానం లేకపోతే ఎట్లా చెప్పు.

సుబ్బా:- బావా! అదుగో అటుచూడు. సరూ ... ఎట్లా తలొంచుకు పోతున్నదో. అదంతా సిగ్గేనా. అవునా బావా.

గోపా:- అదుగో ఆ ప్రేలాపనే వద్దంటున్నాను.

సుబ్బా:- (బుంగమూతిపెట్టి) సర్లే బావా.

[రంగారావు వస్తాడు]

రంగా:- ఏమిటోయ్ బావమరుదు లిద్దరూ ఏదో సర్దాగా మాట్లాడుతున్నారు. [కొడుకుతో] ఏరా ఏమిటి విశేషం.

సుబ్బా:- నాన్నా, మరే, నేనే, మన మావయ్యా కూతురు సరూని, ప్రే, ప్రే (గోపాలాన్ని చూసి ఆగుతాడు)

రంగా: ప్రేమించావా?

సుబ్బా:- [అవునన్నట్లు తలూపుతాడు]

రంగా:- [అటుచూసి] చూశారా అక్కగారూ. నేనేదో చెప్పానని మీరేమో అనుకుంటారు, వాడికి తెలివి తేటలు లేవని గోపాలం అంచనా. కాని మావాడు అఖండుడు.

సుబ్బా:- [బుంగమూతి పెట్టి] బావకు నేనంటే సుతరామూ యిష్టంలేదు. [అటుచూసి] నీకో సరూ? పోనీ లే మాట్లాడవుకదూ?

రంగా:- ఒరేయ్! అదేంచెప్తుతుంటిరా? చిన్నపిల్ల. మావయ్యతో నేచెప్తాగా.

గోపా:- ఎన్ని చెప్పినా, మీచెప్పుడుమాటలు విని గొంతు కోసుకునే మూర్ఖురాలుకాదు మాసరస్వతి.

[రామయ్య వుసూరుమంటూ వస్తాడు]

రామ:- రామచంద్రప్రభో! ఎక్కడున్నావు నాయినా! [బుజాన కండువాతీసి] ఏమిటి సంగతులు బావగారూ?

గోపా:- ఏమిటి నాన్నా అంత ఆవేదన పడుతున్నావ్?

రామ:- కాసిని మంచినీళ్ళివ్వరా గోపీ. [పుసూసుమంటూ కుర్చీలో కూర్చుంటాడు. గోపాలం తెచ్చిన మంచినీళ్లు తాగుతాడు]

రంగా:- ఏమిటి బావగారూ అంత నీరసంగా వున్నారు. పొలం రిజిస్టరయి డబ్బు పూర్తిగా వచ్చిందా.

రామ:- వచ్చేసింది. యివిగో బాకీలు తీర్చిన ప్రోనోట్లు వచ్చిన పదిహేను వందల్లో సదకొండు వందలు వడ్డీలతో సహా బాకీలు తీర్చగా నాలుగొందలు మిగిలినాయి. యింక అమ్మవలసిందీ లేదు, తీర్చ వలసిందీ లేదు. ఇక సంసారం ఎట్లాగడుస్తుందో అర్థం కావటంలేదు.

రంగా:- ఎందుకు బావగారూ అంత దిగులు. ఈ చదువు పూర్తి కాగానే గోపాలం చేతికొస్తాడు. మీకేం తక్కువ చెప్పండి.

సుబ్బా:- అవును మావయ్యా. బావ బి. ఏ. ప్యాసవంగానే ఉద్యోగం చేసేస్తాడు.

గోపా:- [ కోపంతో చూస్తాడు. ]

రామ:- బావగారూ! మూలిగేనక్కమీద తాటికాయ పడ్డట్లు నాకు పెన్షను యింకా రాకపోగా నూట ఏభైరూపా యిలు ఏదో బాపతు కట్టాలని నోటీసిచ్చారు. నాబాధ ఆ పరమాత్ముడికే తెలియాలి.

గోపా:- ఆడబ్బు కడితేనేగాని పెన్షను యివ్వరా?

రామ:- అంతే మరి.

రంగా:- వేన్నీళ్ళతో కొంపలంటుకుంటాయటగాని బావగారూ! మనమూ పెద్దవాళ్ళ మవుతున్నాం. పిల్లల ముద్దు ముచ్చట్లు దీర్చవలసిన బాధ్యత మన యందున్నది. నాకూ ఒక్కగానొక్క కొడుకు. ఈ శ్రావణ మాసంలో పిళ్ళిద్దరికీ ముడి పెట్టేస్తే మన కే బరువు బాధ్యతలూ ఉండవు. మీచెల్లెలు ఆత్మ శాంతిస్తుంది. వాడూ తల్లి లేనివాడు.

రామ:-బావగారూ! నాకూ బరువు వదలించుకోవాలనే వుంది. కాని, సూక లేనివాడు పోక చేయలేడు కదా; పెళ్ళి ఎట్లాచేసేది చెప్పండి.

రంగా:- మీరు 'సరే'నని ముహూర్తం పెట్టించండి. తరువాత విషయాలు నే చూసుకుంటా.

గోపా:- యిప్పుడేం తొందర నాన్నా. కాస్త నిదానంగా ఆలోచిద్దాం. [తల్లితో] ఏమిటమ్మా; నువ్వు మరీను. కాస్త ఈ విషయంలో నయినా నే చెప్పినట్లు వినండి. ఎందుకింత తొందర.

కాంతా:- ......

గోపా:- ఏమిటీ? ఈడొచ్చిన పిల్లను యింట్లో ఎన్నాళ్ళు అట్టే పెట్టుకుంటా మంటావా? చూడమ్మా! కని, పెంచి, పెద్దచేసి, విద్యా బుద్ధులు నేర్పించారు. కాస్త లోక జ్ఞానం మాకూ వుంది. మామాటకూడా ఆలకిస్తే...

రంగా:- ఏమిటోయ్ గోపాలం. చిన్నవాడివి నువ్వూరుకో.

సుబ్బా:- అవును బావా! మనమంతా చిన్నవాళ్ళం. పెద్ద వాళ్ళని ఎదిరించకూడదు. వాళ్ళు చెప్పినట్లు వినాలి.

గోపా:- వింటువుగాని. త్వరలోనే వింటావులే.

రామ:- గోపీ! ఎందుకురా వాదన? మరీ రెచ్చిపోతున్నావు. వాడంటే అంత వంటికాలుమీద లేస్తావేం?

గోపా:- మీ యిష్టం నాన్నా. మీ యిష్టప్రకారమే చెయ్యండి.

రంగా:- ఉడుకురక్తం బావగారూ. ఏదో కుర్రతనపు ఆలోచనలు. వాళ్ళని మనం లెక్కచేసుకుంటే.......

రామ:- ఆలోచిద్దాంలెండి బావగారూ. ఇప్పుడేం ముహూర్తాలు మించిపోటంలేదుగా?

సుబ్బా:- యింకా ఏం ఆలోచించాలి మావయ్యా? నువ్వే అట్టాంటే ఈ మేనల్లుడు ఏంగాను........

రంగా:- మావయ్య, మాటదాటుతాడనే అనుమానం నీకక్కర్లేదురా. మాటంటే మాటే. సరే బావగారూ! అట్లాగే ఆలోచించే చెప్పండి. నేమరి వెళ్ళొస్తా. (కొడుకుతో) సరిగ్గా చదువుకుంటూండు. ఊరికే తిరక్కు. (అటుచూసి) వెళ్ళొస్తానండి అక్కగారూ. సరూ! వస్తానమ్మా (వెడతాడు)

రామ:- సుబ్బూ! ఎట్లావుందయ్యా చదువు? కాలేజీకి పోతున్నా నా?

సుబ్బా:- బాగా చదువుతున్నా మావయ్యా. ఈ సంవత్సరం బహుశా........

రామ:- ఏం. అనుమానిస్తున్నావ్?

సుబ్బా:- క్లాస్‌లో ప్యాసవుతానని ఎక్స్పెక్ట్ చేస్తున్నా.

రామ:- మంచిదే నాయినా. ఏదో యిక్కడుండి చదువుతున్నందుకు మాకూ సంతోషమేగా.

సుబ్బా:- ఏదో మీ అనుగ్రహం, చలవ వుంటే అదెంత పని మావయ్యా?

రామ:- సుబ్బూ!...........

సుబ్బా:- ఏం మావయ్యా?

రామ:- (ఏదో ఆలోచిస్తూ) ఏం లేదులే చదువుకో. (లోపలికి వెడతాడు)

సుబ్బా:- (తనలో) మావయ్య ఏమిటో చెపుతూ ఆగాడే? ఏమిటి చెప్మా?...... ఒకవేళ నా పెళ్ళి విషయం కాదుగద? ... ఏమిటో? ... అంతా కలసి నన్ను హైనమోలో పెట్టేస్తున్నారు.

[ప్రభాకరం ప్రవేశిస్తాడు]

ప్రభా:- (నవ్వుతూ వస్తూనే) ఏమిటంటావోయ్! మిమ్మల్ని హైనమోలో పెట్టటమేమిటి?

సుబ్బా:- [తడబడుతూ] అదేనండీ ... తస్సచెక్క వెధవ మాట. గుర్తుకురాదు సమయానికి.

ప్రభా:- డైలమాలో పెట్టారనా మీ భావం.

సుబ్బా:- ఆఁ. అదేనండి అదే. అయినా దానికీ, దీనికీ, ఆటే డిఫికల్టీ లేదుగా.

ప్రభా:- [నవ్వుతూ] చంపేస్తున్నారండి మీ యింగ్లీషుతో.

సుబ్బా:- అదేనండీ. డిఫరెన్సుకి డిఫికల్టీ అని వచ్చింది. ఏదో పొరపాటు. మాటల సందడిలో మర్చి పోయాను. మిమ్మల్ని ఎక్కడో చూసినట్లు గుర్తు.

ప్రభా:- ఎక్కడో చెప్పండి?

సుబ్బా:- సర్లెండి. ఆమాత్రం గుర్తుంచే...యింక అడగట మెందుకూ?... సరే యింతకి మీారెవరు? ఎందు కొచ్చారు? అరే, నిల్చునే మాట్లాడుతున్నారు. కూర్చోండి.

ప్రభా:- ఫరవాలేదు. నాపేరు ప్రభాకరం. గోపాలం ఫ్రెండుని. బహుశా నన్నిక్కడే చూసుంటారు.

సుబ్బా:- ఏమోలెండి. గుర్తుకు రావటంలేదు.

ప్రభా:- [ఎరగనట్లుగా] పోనీండి. తమనామధేయం.

సుబ్బా:- [కొంచెం దర్జాగా] నన్నే ఎరగరుటండీ? చాలా యిదిగా వుందే?

ప్రభా:- చూశానుగాని అంత బాగా......

సుబ్బా:- గుర్తు లేదంటారు. అంతేనా?... చూడండి...మీారు కాలేజీలో చదువుకునేవాళ్ళుగా, నేనెవరినో చెప్పండి చూద్దాం.

ప్రభా:- పోనీ మీారే చెప్పండి.

సుబ్బా:- హుఁ. యింతేనా! నేనా...నేను... యీా యింటికి మేనల్లుడిని...కాదుకాదు... రామయ్యగారి మేనల్లుడిని.

ప్రభా:- My God.

సుబ్బా:- అదేమిటండి! దేవుడు గుర్తొచ్చాడా.

ప్రభా:- మీారు రామయ్యగారి మేనల్లుడా?

సుబ్బా:- అవును. అంతే కాదు. దేవుడు మేలు చేస్తే కాబోయే......అబ్బే...... ఏంలేదు... ఏంకాదు.

ప్రభా:- నేనూ అదే అనుకున్నా. చూశారూ?

సుబ్బా:- ఏమిటది?

ప్రభా:- అదే............

సుబ్బా:- [ ఎగా దిగా చూస్తుని ] అంటే?

ప్రభా:- మీ Faceలో చాలా Grace వుంది. అచ్చంగా అల్లుడికళ వుందంటే నమ్మండి.

సుబ్బా:- ఆఁ. నిజమాండి? మీరు జ్యోతిష్యంకూడా చెప్తారా ?

ప్రభా:- అక్కర్లేదు. ముఖ కవళికల్నిబట్టి అంతా చెప్పేస్తా.

సుబ్బా:- [ అటూ యిటూ చూసి ] అయితే నాకూ, మా మామయ్య కూతురు సరస్వతికి పెళ్ళవుతుందంటారా?

ప్రభా:- ఓ, తప్పకుండా. అసలింతకీ మీ మామయ్య కూతురుకు మీమీద ప్రేమవుందా?

సుబ్బా:- చంపేశారు. పెద్దప్రశ్నే! అయినాగాని I am ready to Marry her. అంటే Fifty Percent సక్సెస్ అవునంటారా?

ప్రభా:- తప్పకుండాను. చూడండి! అసలు ఏ పరీక్షకయినా రావలసిన Pass Marks ముప్ఫైఅయిదు, సలభైపర్సెంటు అవునా? కాని మీ ప్రేమపరీక్షలో మీకు Fifty percent వచ్చింది. More than the required Marks. ఇంక ఎట్లా తప్పుతాకు చెప్పండి?

సుబ్బా:- బాగా చెప్పారండి.

ప్రభా:- పోనీ ఒకవేళ Fail అవుతారనుకోండి, దిగులు పడకూడదు. Sportsman Spirit ఉండాలి. తెల్సిందా?

సుబ్బా:- [ కొంచెం బుంగమూతితో ] పోన్లెండి. మీకూ వేళాకోళంగావుంది. సరే ఏంచేస్తాం. పోనీ ఓ చిన్న సాయం చేస్తారా?

ప్రభా:- ఏమిటది?

సుబ్బా:- మాబావతో చెప్పి కాస్త రాయబారం చేద్దురూ. మీకు పుణ్యంవుంటుంది.

ప్రభా:- ఓ యస్. అట్లాగే. గోపాలం యిప్పుడప్పుడే రాడల్లే వుంది. నేనెళ్లొస్తా.

[ గోపాలం వస్తాడు ]

సుబ్బా:- నీకు నూరేళ్ళు ఆయుషు, వెయ్యేళ్ళు అయిదోతనం బావా. నీసంగతే అనుకుంటున్నాం. ఇంకా రాలేదని.

ప్రభా:- అయిదోతనం ఏమిటి? బావ ఆడదైపోయాడా ఈమధ్య?

గోపా:- అయినా బావుండును. మా సుబ్బులు బావను చేసు కుందును. ఏం బావా! నేనంటే యిష్టమేనా?

సుబ్బా:- పో బావా. నేనంటే మీకంతా ఎగతాళిగా వుంది.

గోపా:-నువ్వంటే ఎగతాళా? నిన్ను చూస్తుంటే సంతోషంగా వుంది.

ప్రభా:- కాబోయే...అందుకని.

సుబ్బా:- పోనీలేండి. నవ్వీన నాపచేనే పండుతుంది. సరే. నే నట్లా షికారు వెళ్ళొస్తా బావా. [వెడతాడు]

గోపా:- ఏరా ప్రభాకరం! యిందాకట్నుంచీ మా బావతో కాలక్షేపం చేస్తున్నావా? ఎంత సేపయింది వచ్చి?

ప్రభా:- పావుగంట అయిందిలే. పాపం! నెర్రిబాగులవాడు.

రామ:- [వస్తూనే చిరాకుతో] ఎవరా నెర్రిబాగులవాడు. అందరికీ అలుసయి పోయింది. ఏరా గోపీ! యింత వరకూ ఎక్కడికి వెళ్ళావ్?

గోపా:- అట్లా స్నేహితుడింటికి వెళ్ళి యిప్పుడే వచ్చాను. ప్రభాకరం వస్తేను మాట్లాడుతున్నా.

ప్రభా:- నమస్కారం బాబుగారూ. కులాసాగా వున్నారా?

రామ:- అదే కులాసా. బాగా ఆలోచిస్తే అసలు కులాసా అనే మాటకు అర్థం లేదు నేటిబీరకాయలాగ. ఈ రోజుల్లో అసలు ఎవడు కులాసాగా వున్నారో చెప్పండి? ప్రతివాడికీ ఏదో ఒక బాధ.

ప్రభా:- [ఆలోచిస్తూ] అవును. మీరు చెప్పందీ నిజమే. ఏదయినా అనుభవం మీదగాని తెలియదు.

రామ:- [కొంచం నవ్వి] చిన్నవాడి వయినా మాట తొణక్కుండా సమాధానం చెప్పావ్. బాగా చదువుతున్నావా? మావాడు [కొడుకును చూస్తూ] అసలు ప్యాసవుతాడాని...

ప్రభా:- అనుమానం ఎందుకండి? వాడు క్లాసులో ప్యాసు కాకపోతే, ఎడం చెవ్వు యిచ్చేస్తాను.

గోపా:- నాసంగతెట్లా వున్నా, నువ్వుమటుకు ఫస్టు క్లాసులో ప్యాసవటం ఖాయం.

ప్రభా:- వస్తానురా. ఊరికేనే చూసి పోదామని వచ్చా. శలవు బాబుగారూ. [వెడతాడు]

గోపా:- నాన్నా !

రామ:- ఏమిట్రా?

గోపా:- ఒక్క విషయం చెప్పునాన్నా. సరూని బావకే యిచ్చి చేస్తారా?

రామ:- విధి వ్రాత ఎవరు తప్పిస్తార్రా? తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలాలు రమ్మంటే ఎట్లావస్తాయిరా పిచ్చివాడ! నాకూ అల్లుడు కలెక్టరవుతే బాగుండునని వుంది. కాని, ఆ యోగ్యత వుండొద్దూ చెప్పు. జీవితంలో ప్రతివాడికీ కోరికలు వుంటం సహజమే. కాని సాగొద్దురా. పెద్దవాణ్ణి ఊరు పొమ్మంటోంది, కాడి రమ్మంటోంది. ఈ స్థితిలో కాళ్ళీడ్చుకుంటూ ఎక్కడ తిరగను చెప్పు. (కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి) తిరిగినా, నా చిట్టితల్లికి కట్నాలిచ్చి మంచి సంబంధం వెదకి ఎట్లాచెయ్యను చెప్పు. ఉన్న ఎకరం అమ్మి అప్పులు తీర్చాను. ముప్పై సంవత్సరాలు ఉద్యోగం చేసి నేను సంపాదించి మిగిల్చిన ఆస్తి చిల్లికానీ లేదు. జీవితం అంతిమదశలో పిల్లకు ఇష్టంలేని సంబంధం ఈ ముసలాడు కట్టబెట్టాడు అన్న చెడ్డపేరుకూడా తెచ్చుకుని, కుమిలి ఏడవాల్సొచ్చిందిరా బాబూ!......... నాకు తెల్సు. ఈ సంబంధం ఎవ్వరికీ యిష్టంలేదని. కాని కాలానికి తలొగ్గి, గుండె రాయిచేసుకుని, నా చిట్టి తల్లిని ఆ వెఱ్ఱిబాగులవాడి చేతుల్లో పెడుతున్నానురా......యింతకన్న.........

[ మాట్లాడలేకపోతాడు. కుర్చీలో కూలబడతాడు ]

గోపా:- నాన్నా!

రామ:- నాన్న! ఈ నాన్న కన్నబిడ్డలమీద మమకారం లేని అప్రాచ్యుడు. కన్నబిడ్డను కసాయివాడికిచ్చి చేసే కఠినాత్ముడు.

గోపా:- విచారించకు నాన్నా. ఎందుకంత బాధపడతారు?

రామ:- బాధకాక ఏముందిరా. ఈ రోజున పావుబస్తాబియ్యం కొనటానికి డబ్బులేనివాడికి, పిల్లలమీద మమకారం ఎంతుంటే ఏం లాభం చెప్పు. జీవితంలో ఏ నాడో ఘోరమయిన పాపంచేశాను. ఈనాడు నా బంగారు తల్లి గొంతుకోసి ఆ వెఱ్ఱిబాగులవాడి చేతిలో పెట్టి దానిజీవితం నాశనం చేద్దామని సంకల్పించాను. ఇంతకన్న నాకు చావురాకూడదురా?

గోపా:- [లోపలకుచూస్తూ] అమ్మా! ఏమిటి నాన్న యిట్లా మాట్లాడుతున్నారు?

రామ:- మీ అమ్మా, సరూ యిద్దరూ గుళ్ళోకి వెళ్ళారురా. అందుకనే, నాకడుపులోవుండే బాధ వెళ్ళగక్కుతున్నాను.

గోపా:- యింట్లో ఎవరూ లేరన్నమాట. (కొంచం సంతోషంతో) నాన్నా!

రామ:- ఏమిట్రా.

గోపా:- మీాకు సరేనంటే సరస్వతిని ప్రభాకరం చేసుకుంటాడు. ఈ విషయం యిదివరికే వాడితో హెచ్చరించా.

రామ:- ప్రభాకరమా! సరూని చేసుకుంటాడా!

గోపా:- అవున్నాన్నా. నిజం. ఈ సంబంధం సరూకీ యిష్టమే.

రామ:- [కొంచం ఆవేదనతో] కట్నం?

గోపా:-ఏమీా అక్కర్లేదు.

రామ:- అక్కర్లేదేం? అని నువ్వనుకుంటున్నావా? ఈరోజుల్లో అంత విశాల హృదయం ఎవరికుందిరా? పిల్లదాని అందంచూసి మాటవరసకు అతను అన్నా, పెద్దవాళ్ళు వప్పుకోవద్దూ ? కాపరానికి వెళ్ళింది లగాయతూ దాన్ని రాచి రంపాన పెడతారు. ఈ విషయాలు నీకు తెలియవురా. రోజులు వెనకటి రోజులుకావు.

గోపా:- అయితే సరూని బావకే యిచ్చి చేస్తారా.

రామ:- రాసిపెట్టి వుంటే తప్పుతుందిరా. విధివ్రాత మనం తప్పించగలమా?

గోపా:- విధి. ఏమిటివిధి. విధి, కర్మ అనేవి పెద్దలు తెచ్చి పెట్టేవిగాని, మరేంకాదు. మిమ్మల్ని కాదన్నందుకు క్షమించండి. పద్దెనిమిదేళ్ళు పెంచి, పెద్దదాన్ని చేసి, ఈనోజున బీదరికమనే వంకతో ఆ వెట్టిబాగుల వాడికి కట్టబెడతారా నాన్నా? నా మాట వినండి. ఎంత మాత్రం ఈ సంబంధం వద్దు. దాని గొంతుకోసే బదులు కాళ్ళు చేతులూ కట్టి ఏ బావిలోనన్నా పడెయ్యండి. మీా బరువు తీరుతుంది. దానికీ ఏ బాధా లేకుండా పోతుంది.

రామ:- గోపీ! ఏమిట్రా అంటున్నావ్? నా కన్నబిడ్డల మీద నాకు ప్రేమ లేదురా? సరైన సంబంధం చెయ్యలేకపోతే కాళ్ళు చేతులూ కట్టి బావిలో పడెయ్యాలిరా?... అవును. ఎందుకుకాదు ... ఎందుకూ పనికిరాని ఈ దరిద్రుడు తన కన్నపిల్లలకి యింతకన్న చేసేదేముంది? అందర్నీ కట్టగట్టి ... ...

['టెలిగ్రాం సార్' అని కేక. గోపాలం వెళ్ళి టెలిగ్రాం తీసుకుంటాడు. రామయ్య కంగారు పడుతూంటాడు. గోపాలం టెలిగ్రాం చదువుతాడు.]

Sudarsanam — Expired — Start.
Murahari Rao.

గోపా:- అమ్మా! నాన్నా! కొంపమునిగింది. సుదర్శనం బావ పోయాట్ట...నాన్నా! అక్కయ్య పిల్లలుగతి ఏంగాను. [తలబాదుకుంటాడు.] అమ్మా! సరూ! బావా! సమయానికి ఎవరూ లేరే...అక్కయ్యా! ఎంత దుర్దశ పట్టిందే...అమ్మా!

రామ:- సుదర్శనం...నాఅల్లుడు...పోయాడా?... నా కడుపున చిచ్చుపెట్టి, ఆ తల్లీ పిల్లల్ని నామీద పడేసి పోయాడా?...పెళ్ళయి కాపురానికి వెళ్ళినప్పట్నుంచీ దాన్ని కాల్చుకుతిని, కాస్త కాపురం కుదుట బడిందని కొంత మనశ్శాంతి కలిగిన తరువాత, నాబంగారుతల్లి కృష్ణవేణిని ఏకాకిని చేసి పోయాడా? ... అవును. పోయాడు. ఒక అల్లుడికోసం సంబంధం మాట్లాడుతూ వుంటే ఉన్న అల్లుడు పోయాడు...హిహిహి...నేను

మిగిలాను. డబ్బు లేకపోయినా, ఆ సంసారాన్నంతా నేనే పోషిస్తాను...నన్ను భగవంతుడు పోషిస్తాడు... అదుగో సుదర్శనం పిలుస్తున్నాడు ... సుదర్శనం ... వస్తున్నా ... [పడిపోతాడు.]

గోపా:- "నాన్నా"! అంటూ వాపోతుండగా.

[ తెర ]

స మా ప్త ం.

# పందిరిగుంజలు

[ నాటిక ]

## పాత్రలు

| | | | | |
|---|---|---|---|---|
| రామకోటి | — | 50 సం॥ | వయస్సు. | |
| రాజారాం | — | 20 సం॥ | ,, | రామకోటి కుమార్డు. |
| జగన్నాధం | — | 22 సం॥ | ,, | వారాలబ్బాయి. |
| ప్రకాశం | — | 22 సం॥ | ,, | రాజారాం స్నేహితుడు. |
| ప్రసాదరావు | — | 52 సం॥ | ,, | ప్రకాశం తండ్రి. |
| సుజాత | — | 18 సం॥ | రామకోటి కుమార్తె. | |

[ ప్రకాశం గది, గదికి మూడు గుమ్మాలు, ఒక ప్రక్కన డ్రాయరు, కుర్చీ, ప్రక్కన యింకొక కుర్చీ. గోడలకు బొమ్మల క్యాలండర్లు వుంటాయి. ప్రకాశం గదిలో పేపరు చదువుతూ పచార్లుచేస్తుంటాడు ]

ప్రకాశం:- (పేపరు చదువుతూ) కొంపమునిగింది. ఘోరం. అంత మంచి చెడ్డలు తెలియనివాడికి ఈ పంచాయితీ బోర్డు ప్రెశిడెంటు పదవి ఎందుకో? పులి పిల్లి అయి పోయింది. ఈ జాతకుడిపని యిక ఖాళీ.

రాజారాం:- (ప్రవేశిస్తూ) ఏమిట్రోయ్! పులి పిల్లి అయి పోయిందనీ, జాతకుడిపని ఖాళీ అనీ అంటున్నావ్. ఏంజరిగిం దేమిటి?

ప్రకా:- (పేపరు చేతికిచ్చి) చూడు పేపర్లో ఈ విషయం. పదవులు నిలబెట్టుకోవటం చేతకానివాళ్ళకి ఈ ప్రెశి డెంటు పదవి ఎందుకంట? పోనీ, చేస్తున్నాడయ్యా, తప్పులుచేసి దిద్దుకోటం తెలియనివాళ్ళు ఈ పని చెయ్యటం దేనికిచెప్పు?

రాజా:- (పేపరు చదివి) చాలా బాగుందిరా నువ్వనేది. డబ్బు కాజేసినా, అది పైకి పొక్కకుండా వుండా లంటావ్! అంతేనా? బుద్ధిః కర్మానుసారిణీ అని, కర్మను బట్టే బుద్ధి వక్రమార్గం పడుతుంది. దానికి నువ్వూ, నేనూ బాధపడి ప్రయోజనం ఏముంగిచెప్పు?

ప్రకా:- ఏదెట్లావున్నా, ముందు మనపని సున్నా అయింది.

రాజా:- అవున్లే. జైలుకుపోతే పోయాడుగాని, నీకస్సలే లేద నేగా నీచింత? ఒకసారి వెళ్ళి విషయమేమిటో చూసి రారాదూ.

ప్రకా:- మనంవెళ్ళి ఏంచేస్తాం చెప్పు? చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత. అయినా పెద్దవాడున్నాడుగా, నేవెళ్ళి చేసేదేముంది?

రాజా:- ఇంతకీ ఏమాత్రం గుటకాయిస్వాహా అయిందేమిటి బోక్కుసొమ్ము?

ప్రకా:- ఏమో ఏమాత్రమో. ఎంతయితే ఏంలే, దక్క సస్తాడు. ఎంతయిందీ త్వరలోనే తేల్తుందిగా. ఏం చెయ్యటానికీ తోచటం లేదురా.

రాజా:- ఆలోచించి ఏంలాభం చెప్పు? ఆలోచనలు అలల్లాంటివి. అవి ఉవ్వెత్తుగాలేచి, ఒడ్డుతగలంగానే యిట్టే చెదిరిపోతాయి. అంతేగా!

ప్రకా:- నీదంతా అదోగోడు. ఒరేయ్! ఈ ప్రపంచం దేని చుట్టూ తిరుగుతున్నదిరా?

రాజా:- సూర్యునిచుట్టూ అని మా జాగ్రఫీ మేష్టరు చెప్పినట్లు గుర్తు. మీ జాగ్రఫీమేష్ట రేంచెప్పాడేమిటి?

ప్రకా:- అదే చెప్పాడులే. కాని ఎవరు చూశారు? నా ఉద్దేశ్యంలో మాత్రం డబ్బుచుట్టూ తిరుగుచున్నది. ఆడబ్బు చుట్టూ మనం తిరగాలోయ్. అప్పుడుగాని అంతా మనచుట్టూ తిరగదు.

[ జగన్నాథం వస్తాడు ]

జగన్నా:- ఏమిట్రా ప్రకాశం అట్లావున్నావ్. వంట్లో బాగా లేదా? కిళ్ళీకొట్టువాడు అప్పివ్వ లేదా? నీభావగీతాలు అచ్చువేసుకోనన్నారా? లేక, కథలు పత్రికలవాళ్ళు తిప్పేశారా?

ప్రకా:- ఒరేయ్! నీబోటివాడికి నాలాటివాడిబాధ ఏం తెలుస్తుంది చెప్పు. నీకున్నదల్లా ఒక టేబాధ. ఆదివారం అచ్చయ్యగారింటికి, సోమవారం సోమిదేవమ్మగారింటికి, మంగళవారం మంగపతిరావుగారింటికి, బుధవారం ఎవరింటికా అని, అదేగా నీబాధ?

జగ:- నీ ఉద్దేశ్యంలో అయితే అంతేకావచ్చు. అవును. ఉన్నవాడికి ఒకటే ఊరయితే, లేనివాడికి అన్నీ ఊళ్ళే.

అసలు యింతకీ ఏమిటి సంగతి? ఏరా రాజారాం! నువ్వూ మాట్లాడవేం?

ప్రకా:- [ చెప్పవద్దని సంజ్ఞ చేస్తాడు ]

రాజా:- [ మాట్లాడడు. ]

జగ:- పోనీలేరా. ఇవ్వాళ కాకపోతే రేపయినా తెలీదంటావా? కడుపుతో వున్నమ్మ కనకపోదుగదా?

ప్రకా:- ఎబార్షన్ కాకూడదా ఏం? మహా పెద్ద చెప్పావ్.

జగ:- పోనీ, చెప్పకురా. చెవులు మూసుకోనా, కళ్ళు మూసుకోనా?

ప్రకా:- చెపితే మహా నువ్వు ఆర్చేవాడివీ, తీర్చేవాడివీ బయల్దేరావ్. అయినా వారాలు చేసుకుని చదువుకునే వాడివి యితగ్గ విషయాలు ఎందుకురా నీకు? పూట కూటికి టికానా లేనివాడికి పెద్ద వ్యవహారాలు చెప్పాలి. ఈమాత్రం సలహాయిచ్చి అఘోరించే వాడు లేడని. అయినా నీ సలహా నాకక్కర్లేదు.

రాజా:- ప్రకాశం! ఎందుకురా అంత నోటిదురుసు?

ప్రకా:- నోటిదురుసుకాదు. వాడి అతి ప్రేలాపనను గురించే నే చెప్తున్నది.

జగ:- నువ్వన్నావన్న బాధ నాకేం లేదురా. Fortune turns like a wheel అదృష్టం ఒక చక్రంలాంటిది. అది మాన వుడ్ని పైకి లేవనెత్తనూగలదు, అణగ ద్రొక్కనూ గలదు. నువ్వన్న దాంట్లో ఒకటిమాత్రం నిజం. ఏనాటి కయినా నువ్వు ఆర్చేవాడివి, నేను తప్పక తీర్చే వాడినీ. ఈ మాటమాత్రం గుర్తుంచుకో.

ప్రకా:- మహ తీర్చేవాడివి బయల్దేరావ్. నీ తాహతుకు నన్ను ఎదిరిస్తున్నావ్. మిస్టర్ జగన్నాధం! ఈ నెల నుంచీ నేనుయిచ్చే పదిరూపాయల సాయం ఆపేస్తున్నాను. యింక యివ్వను.

రాజా:- ప్రకాశం! చాలా హద్దు మీరి మాట్లాడుతున్నావురా. కాలేజీ స్టూడెంటుకుండవలసిన లక్షణాలు కావు. చిన్నపిల్లల కీచులాటల్లా వున్నాయి.

జగ:- రాజా! నువ్వెందుకురా బాధపడటం? మిస్టర్ ప్రకాశం ఈ రోజునుంచీ నువ్వు నాకు సహాయం చెయ్యనక్కర్లేదు. యింతవరకూ చేసినదానికి కృతజ్ఞుణ్ణి. అవకాశం దొరకగానే నీ ఋణం తీర్చుకుంటాను.

ప్రకా:- మహా తీర్చావ్ లేవోయ్. వారాలు చేసుకుని, పొట్ట గడవక, దేహీ అని యాచించి చదివేవాడికి లక్ష్మీదేవి కటాక్షించి, రూపాయిల వర్షం కురిపిస్తుంది. అహ్హా హ్హా హ్హా హ్హా!

జగ:- ఆ రోజు నాకు వచ్చినా రాకపోయినా, నీ పాపం బ్రద్దలయ్యే రోజుమాత్రం త్వరలోనే వస్తుంది. అది ఖాయం.

ప్రకా:- షటప్ ఇడియట్!

రాజా:- ప్రకాశం! వ్యవహారం శృతిమించింది. నిన్నటివరకూ నువ్వు ఏ విధంగా మాట్లాడినా చలామణి అయ్యేది. ఈ రోజునుంచీ నీ పొగరు అంతరించేరోజు వచ్చింది. కాస్త కళ్ళు వించి ముందు, వెనకలు ఆలోచించి మాట్లాడు. ఈ రోజునించీ నువ్వాక......

ప్రకా:- తమరు చెప్పనక్కర్లేదు. దొంగనోట్లు చలామణిచేసి, పట్టుబడి, జైలుకువెళ్ళినట్టి రామకోటిగారి సుపుత్ర రత్నమా, తమ సలహా నాకనవసరం! నా ప్రస్తావన చేశావా అర్ధచంద్రం అప్లై చెయ్యవలసి వస్తుంది. జాగ్రత!

రాజా:- (తల వంచుకుంటాడు)

జగ:- రాజా! యింక చాలు. పోదాం పద.

ప్రకా:- వెళ్ళండి. ఉండి నన్నేం ఉద్ధరించనక్కర్లేదు.

[యిద్దరూ వెళ్ళిపోతారు]

(లైట్లు సన్నగిలి మళ్ళా వెలుగుతాయి)

[ప్రకాశంగది. ప్రకాశం తీవ్రంగా ఆలోచిస్తూ, పచార్లు చేస్తూవుంటాడు.]

[సుజాత తలుపుతీసుకుని వస్తుంది]

ప్రకా:- ఓ. నువ్వా సుజాతా! రా కూర్చో.

సుజా:- తమ గౌరవ, మర్యాదలకు ధన్యవాదాలు. ఎంత మర్యాద!

ప్రకా:- ఎందుకా కోపం?

సుజా:- పాము చుట్టమూ, పడిగ పగనా?

ప్రకా:- ఏమిటి నీ ప్రేలాపన?

సుజా:- పేపర్లో పడిన విషయాలు. అది చదవగానే తమ బుద్ధి మారిన సంగతీ, అన్నయ్యనూ, జగన్నాథాన్ని తూలనాడిన సంగతీ అంతా విన్నాను.

ప్రకా:- మంచిదే. ఆ ఘనులిద్దరూ తమవద్ద కేసు ఫైల్ చేసారన్నమాట? యిక జడ్జిమెంటు చెప్పొచ్చు.

సుజా:- జడ్జిమెంటు చెప్పవలసిన దాంట్లో కోర్టు కేవా చెబుతారు.

ప్రకా:- అయితే! ఆఘనులిద్దరూ తమకు మనవిచేసుకున్నారా? చాలా బాగుంది.

సుజా:- మనవి కాదు. నీ దురుసుతనం వాళ్ళ మనస్సుల్ని ఎంత బాధ పెట్టిందో కళ్ళారా చూశాను. మా నాన్న దొంగనోట్లు చలామణిచేసి జైలుకు పోయినమాట నిజమే. కాని, సమయా సమయాలు గమనించక హృదయాల్ని గాయపర్చటం సహృదయుల లక్షణం కాదు.

ప్రకా:- ఓహో! తమకు రాయబారంచేసి, సంధి కుదర్చ టానికొచ్చారా!

సుజా:- సంధి కుదర్చటానికీ, రాయబారం చేయటానికీ...

ప్రకా:- ఇది పాండవోద్యోగ విజయాల నాటకం కాదంటావ్. అంతేనా? (నవ్వుతాడు)

సుజా:- మాటకుమాట చెప్పి నన్ను మభ్యపెట్టలేవు. అసలు ఎందుకీ తగాదా? జగన్నాథానికి ప్రతినెలా చేసే పది రూపాయిల సహాయం ఆపేశావు. పోనీ ప్రస్తుతం నీ పరిస్థితుల్ని బట్టి మానేశావు. కాని అనవసరంగా వారి మనస్సును బాధపెట్టావ్. కాలుజారినా తీసుకో వచ్చుగాని, నోరుజారితే తీసుకోటం కష్టం.

ప్రకా:- సుజాతా! అర్థమయింది. యిదివరకుదాకా ఏమిటో అనుకున్నాను. ఆ వారాలబ్బాయిని.........

సుజా:- చాలించు నీ ప్రేలాపన. నే కాలేజీలో చేరింది ప్రేమించటానికీ, పెళ్ళి చేసుకోటానికీ కాదు. చదువుకోటానికి. నాదృష్టి చదువు మీదనేకాని, ప్రేమల మీద పెళ్ళిళ్ళమీద లేదు. నాకీరోజువరకూ మనస్సులో ఏ దురుద్దేశ్యమూ లేదు. కాని నీ దురుద్దేశ్యం మాత్రం అర్థమయింది.

ప్రకా:- సుజాతా! ఏమిటి నీ ధోరణి.

సుజా:- నీ ధోరణికి జవాబు. మా నాన్న దొంగనోట్లు చలామణిలో జైలుపాలయ్యాడు. ఈ అవమానం భరించలేక మా అమ్మ ఆత్మహత్య చేసుకున్నది. ఉన్న ఒక్క కొంపా అప్పులవాళ్ళు కట్టుకున్నారు. అన్నయ్యా; నేనూ గుండె రాయిచేసుకుని బ్రతుకు తెరువుకోసం చదువులో ప్రవేసించాం. మా ఆశయం చదువుకుని, సత్ప్రవర్తకులుగా ఉద్యోగం చేసుకుని బ్రతకటమే. నా చదువుకు నువ్వుకూడా సాయం చేస్తున్నావంటే మా పరిస్థితిని అర్థంచేసుకుని సహాయం చేస్తున్నావని ఆసించాంగాని, నీలో యింత దురుద్దేశ్యం ఉందని తెల్సుకోలేదు. ఇన్నాళ్లూ తాచుపాము పడగనీడలో వున్నానని గ్రహించలేకపోయాను. ఇప్పటికి కనువిప్పు కలిగించావు. క్షమించు. ఈ రోజునుంచీ నీ సాయం నా కక్కరలేదు. శలవు.

ప్రకా:- సుజాతా! ఏమిటీధోరణి?

సుజా:- ధోరణికాదు. నీ మానసిక ఉన్మాదానికి ఫలితం.
[చరచర వెళ్ళిపోతుంది కోపంతో. ప్రకాశం ఆశ్చర్యంగా చూస్తూవుంటాడు. ఈ సరిస్థితిలో ఒక బిచ్చగానిమాదిరివున్న వ్యక్తి తారట్లాడుతూవచ్చి, సుజాత, ప్రకాశాన్ని చూసి, నిట్టూర్చి, కన్నీరు పెట్టుకుని, గుమ్మంవైపుచూస్తూ వెళ్ళిపోతాడు. ప్రకాశం అతన్ని చూడడు.]

[లైట్లు సన్నగిలి, వెలుగుతాయి]

[ప్రకాశం గది. ప్రకాశం కుర్చీలో కూర్చుని వుంటాడు. తలుపు చప్పుడవుతుంది. తలుపు తీయగానే రాజారాం ప్రవేశిస్తాడు.]

రాజా:- ఏంచేస్తున్నావురా? ఇవాళ కాలేజీకూడా రాలేదు.

ప్రకా:- అవును రాలేదు. అయినా నాకెందుకు చదువు. చదువుకుని, సత్ప్రవర్తకులుగా ఉద్యోగంచేస్తూ, జీవయాత్ర గడుపదలుచుకున్న పెద్దమనుష్యులకు కాలేజీలు కావాలి. నాకెందుకు కాలేజ్!

రాజా:- ఏమిట్రా నీ ధోరణి. వచ్చీరావటంతోనే దుయ్యబడుతున్నావ్.

ప్రకా:- ఓహో! ముందు స్వాగతవచనాలు పలకాలా! అట్లాగే! దయచెయ్యండి! కూర్చోండి! సుజాత... కాదుకాదు తమచెల్లెలు యిచ్చిన లెక్చరు చాలక మళ్ళీ తమరు వచ్చారన్నమాట నన్ను బాధించటానికి.

రాజా:- ఆవేశపడకు ప్రకాశం. ఇప్పుడు మనందరం ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నాం. లేనిపోని కార్పణ్యాలు పెంచుకుని, మనస్సు పాడుచేసుకునేకన్న, కర్తవ్యం ఆలోచించటం మంచిది.

ప్రకా:- తను కల్లిబొల్లి మాటలకు నేను లొంగను. ఉన్నాడుగా అఖండ ప్రజ్ఞావంతుడు మీ జగన్నాధం! వాడితో ఆలోచించు. లేకపోతే సుజాతను పంపు యిద్దరూ ఆలోచిస్తారు.

రాజా:- నీ మాటలు నాకర్థం కావటంలేదు ప్రకాశం. ఏమిట్రా యీ గోలంతా. ఆ పంచాయితీ వ్యవహారం విషయం తేలిందా? ఒక్కసారి యింటికి వెళ్ళిరారా నామాటవిని.

ప్రకా:- ఇంటికా! ఎందుకు? పైపెచ్చు ఆ వుచ్చులో నేనూ తలదూర్చి స్తే చూసి ఆనందిద్దామనా? ఏరా! నన్ను బ్రతకనివ్వదల్చుకోలేదా?

రాజా:- కన్నతల్లి విషయమైనా ఆలోచించు. ఆమె నువ్వు రాలేదని బెంగతో మంచం పట్టిందట. మన జగన్నాధం వారాలవాళ్ళింట్లో ఆ యింటాయిన చెప్పాడట. ఒక్కసారి వెళ్ళిరారా!

ప్రకా:- (విచారంతో) అమ్మ మంచంపట్టిందా? అవును మంచం పట్టక ఏంచేస్తుంది.

రాజా:- ఒక్కసారి వెళ్ళి చూచిరారా. తరువాత నీ యిష్టం వచ్చినట్లు నన్ను తిడుదువుగాని.

ప్రకా:- కెడతాను. ఈ రోజునే వెడతాను. అమ్మను చూసి వస్తా. ఇంకోవిషయం. ఈ రోజు పేపరు చూశావా ?

రాజా:- చూశాను. జయిల్లోనుంచీ పరారీ అయినాట్ట.

ప్రకా:- ఈ రోజేపోయి అమ్మను చూసివస్తాను. (కన్నీరు కారుస్తాడు)

రాజా:- ఎందుకురా విచారపడతావ్ ! సర్లే యీ ఒక్క విషయంలోనయినా నామాట విన్నందుకు చాలా సంతోషంగావుంది. వెళ్ళిరా.

ప్రకా:- ఒక్కమాట. నే వచ్చేటంతవరకూ నువ్వూ, సుజాత నా గదిలోనే వుండండి. మీ గదిలో ఆ వారాల సన్యాసి వుంటాడు.

రాజా:- (నవ్వి) అట్లాగే, సరే నువ్వు బయల్దేరు.

[తెర]

# 2

[తెర లేవంగానే ప్రకాశం గది. రాజారాం, సుజాత వుంటారు.]

రాజా:- ఈ వార్త విన్నావా సుజాతా!

సుజా:- ఏమిటన్నయ్యా ?

రాజా:- నాన్న జైల్లోనుంచి పరారీ అయినతరువాత మళ్ళీ కనబడలేదుట. పోలీసులకు అంతు చిక్కటంలేదుట. ఎక్కడ ఏ అగచాట్లు పడుతున్నారో !

సుజా:- ఏమిటో అన్నయ్యా, జరిగిన విషయాలు తల్చుకుంటే గుండె చెరువవుతున్నది. అక్కయ్య పెళ్ళికి నాన్న పదిహేనువేలు అప్పుచేసి ఖర్చుచేశాడు. అది వడ్డీతో పాతికవేలయింది. సంవత్సరం తిరక్కుండానే అక్కయ్య పోయింది, అప్పు మిగిలింది. ఈ అప్పు తీర్చటానికి నాన్న గత్యంతరంలేక దొంగనోట్ల వ్యవహారంలో తల దూర్చాడు. పోలీసులకి పట్టుబడి పరారీ అయినాడు. ఉన్న ఒక్క యిల్లూ అప్పులవాళ్ళు కట్టుకున్నారు. అబ్బా! అమ్మ ఈ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుంది. చివరకు ఈ అపవాదులన్నీ మోస్తూ జీవచ్ఛవాల్లాగ మనం బ్రతికున్నాం. అంతా అయోమయంగా వుందే!

రాజా:- సుజాతా! అయిందేదో అయిపోయింది. కాని పరాక్రింద వున్న నాన్న స్థితి తల్చుకుంటేనే నాకు పిచ్చెత్తుతున్నది.

[గుమ్మంవద్ద అలుకిడవుతుంది. ఇదివరలో వచ్చిన బిచ్చగాడు గుమ్మంవద్ద వుండి అన్నీ వింటాడు. కన్నీరు కారుస్తాడు. తల బాదుకుంటూ అడుగు ముందుకు వెయ్యలేక, వెనక్కు పోలేక తటపటాయిస్తాడు. రాజారాం తలుపు తెరవంగానే ముఖం చూపించకుండా వెళ్ళిపోతాడు పెద్ద పెద్ద అంగలేస్తూ.]

రాజా:- ఎవరో పాపం! బిచ్చగాడు వెళ్ళిపోయాడు.

సుజా:- ఇలాంటి నిర్భాగ్యులు దేశంలో ఎంతమందో.

రాజా:- (తలుపు వేస్తాడు.)

సుజా:- అన్నయ్యా!

రాజా:- ఏం సుజాతా!

సుజా:- జగన్నాథం అంటే ప్రకాశానికి అంత కోపం దేనికి?

రాజా:- జగన్నాథం కూటికి బీదవాడయినా, కులానికి బీదవాడు కాదు. ప్రకాశం మాదిరి సంకుచితభావాలు లేని వ్యక్తి. అదే వాళ్ళిద్దరికీ పడకపోవటానికి కారణం.

సుజా:- జగన్నాథం మనమాదిరి మనిషి, మనలో కలిసే రకం.

రాజా:- [సుజాతవైపుచూసి కొంటెగా నవ్వుతాడు]

(మళ్ళీ తలుపుచప్పుడు. రాజారాం "ఎవరు" అంటూ తలుపు తీస్తాడు. వెంటనే యింకో బిచ్చగాడు ఆను

ర్గాగా, వగరుస్తూ, ఖంగారుపడుతూ, తూలుకుంటూ వస్తాడు)

బిచ్చ:- పోలీసులు వెంటాడుతున్నారు. తలుపెయ్యండి. నన్ను రక్షించండి. మీకు పుణ్యముంటుంది. అమ్మా! బాబూ! (తల వంచుకుంటాడు)

రాజా:- ఎవరయ్యా నువ్వు? పోలీసులేమిటి! నేం రక్షించట మేమిటి! ఏమిటిదంతా?

సుజా:- దొంగతనం చేశావా! ఖూనీ చేశావా!

బిచ్చ:- కాదు. డబ్బు అపహరించాను. పంచాయితీ డబ్బు, దేవాలయం డబ్బు, అంతా అపహరించాను. జైల్లో పెట్టారు. పరారీ అయినాను. కాని తప్పించుకోటానికి కాదు. (వాళ్ళిద్దరి వైపూ ఎగా దిగా చూసి) మీరా! రామకోటి...కాదు, కాదు. నేపోతాను. తలుపు తియ్యండి.

రాజా:- రామకోటి అంటున్నారు. మా నాన్న మీకు తెలుసా? మీరెవరు? చెప్పండి. భయంలేదు. (నిదానంగాచూసి) మీరు! మీరు! ప్రసాదరావుగారా?

బిచ్చ:- అరవకు బాబూ! ఆ నిర్భాగ్యుణ్ణి నేనే.

సుజా:- [ ఆశ్చర్యంగా ] మీరా! ప్రకాశం తండ్రి ప్రసాదరావుగారా! పంచాయితీ ప్రెసిడెంటు, దేవాలయం ట్రస్టీ ప్రసాదరావుగారా!

బిచ్చ:- అవునుతల్లీ. ఆ పేరు, ఆ పదవులు, ఆఠీవి, ఆరోజుల్లో. యిప్పుడు నేను దోషిని, నేరస్థుణ్ణి, అపరాధిని, దుర్మార్గుణ్ణి, వంచకుణ్ణి! అబ్బా!.....బాబూ!

రాజా:- ఏమండీ?

బిచ్చ:- మీ నాన్న రామకోటి ఆచూకీ దొరికిందా?

రాజా:- లేదండీ! ఆయనా పరారీలోనే ఉన్నారుట. ఎక్కడ వున్నదీ తెలీదు.

ప్రసా:- ఒక ఊరివాళ్ళమయినందుకు మేమిద్దరం యిలాంటి ఘోరమైన పన్లు చేసి యిట్లా తప్పించుకు తిరుగుతున్నాం. కన్నబిడ్డలకు, చేసుకున్న యిల్లాలికీ దూరమై ఈ నికృష్ట జీవితం గడుపుతున్నాం బాబూ! మా నేరానికి మరణ దండనే శిక్ష. (గదంతా చూచి) బాబూ! యిది మీగదేనా?

రాజా:- (సుజాతవైపు చూస్తాడు)

సుజా:- కాదు. మీ ప్రకాశం గది.

ప్రసా:- (ఖంగారుగా) ప్రకాశం గదా! యిది మా ప్రకాశం గదా! ఏ కొడుకయితే తవ్వి తలకెత్తుదామని ఆశించి ఈ ఘోర కృత్యం చేశానో ఆ ప్రకాశంగదా! నా బంగారుతండ్రికి బంగారం ముద్ద చేసిద్దామని వెనకా ముందూ ఆలోచించకుండా యింత అపరాధం చేసిన నాకు చిట్టచివరికి వాడి గదిలోనే ఆశ్రయం దొరికిందా! రామయ్యతండ్రీ! ఎంత దుస్థితికి వచ్చాను. (ఏడుస్తాడు. కన్నీరు తుడుచుకొని) వాడేడి బాబూ!

రాజా:- తల్లికి సుస్తీగా వుందని తెల్సి ఊరు వెళ్ళాడు.

ప్రసా:- అన్నపూర్ణకు సుస్తీనా! ఏమిటి బాబూ జబ్బు! ఏముంటుంది, మనోవ్యాధి. ఇటువంటి అప్రాచ్యుడికి,

దొంగకు, పరమఛండాలుడికి భార్య నయ్యానని మనో వ్యధ. అంతకన్నా సుస్త్రీ ఏముంది. ఈ స్థితిలో, ఈ బిచ్చగాని రూపంలో నన్ను ఎవరు రానిస్తారు! వాళ్ళను ఏమని పలకరించను! అయినా నన్ను రానిస్తారా! ఆదరిస్తారా! తన్ని పోలీసులకు వప్పగిస్తారు. ఈ నీచాతి నీచుడ్ని చూసి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు ప్రసాదరావంటే ఎవరయినా నమ్ముతారా! ఏమిటి నాకీ పిచ్చి! ఎందుకింత మమకారం. నన్ను ఎవరునమ్మాలి! ఎందుకు నమ్మాలి! ఎవరూ నమ్మరు. చివరకు అన్నపూర్ణకూడా నమ్మదు. పోరా పిచ్చివాడా, పోరా బికారీ, అంటుంది. అబ్బా!

రాజా:- బాధపడకండి అట్లా కూర్చుని విశ్రాంతి తీసుకోండి.

ప్రసా:- విశ్రాంతి! బాబూ! ఇక ఈ జీవికి, తుచ్ఛుడికి విశ్రాంతిలేదు. ఒక్కసారే, ప్రాణంపోయిన తరువాతే విశ్రాంతి. చూడమ్మా! సుజాతా! భయంవేస్తోందా? నేను పారిపోయి దాక్కుందామని రాలేదు. ఏమిటో నా పిచ్చి. ఎందుకు పరారీ అయినానో నాకే తెలీదు. పోలీసులు, జైలు, అబ్బ! నరకయాతన. బాబూ!

రాజా:- ఏమిటండి?

ప్రసా:- ఒక్కమాటడుగుతా చెప్తావా?

రాజా:- ఏమిటి?

ప్రసా:- నే చేసిన ఈ దుర్మార్గమయినపనికి ప్రకాశం నన్ను నిందిస్తుంటాడుకదూ! అవును ఎందుకు నిందించడు! పోనీలే వాడు కులాసాగా వుంటున్నాడా?

రాజా:- ఆఁ కులాసానే. ఎప్పుడూ మిమ్మల్ని గురించే ఆలోచన.

ప్రసా:- ఏమిటి నాకీపిచ్చి! అవును నేను పిచ్చివాణ్ణే. కాక పోతే నా ప్రకాశం గదిలోనే దాక్కుని, వాడికంటబడి, పోలీసులు వాడిగది సోదాచూసి, ఈ స్థితిలో వాణ్ణి కూడా ఈ కేసులో యిరికించటమా! వద్దుబాబూ వద్దు. నే వుండను వెడతాను. ఆ జైలుకే పోతాను రాజారాం! నే వెడతాను. (వెళ్ళిపోతాడు)

[రాజారాం, సుజాత ఆశ్చర్యంగా చూస్తావుంటారు]

[తెర]

# 3

[తెర ఎత్తగానే ప్రకాశం గది. గదిలో ఒక్కడే వుంటాడు.]

ప్రకా:- పండంటి కాపురం నాశనమయింది. నాన్న జైలు జీవితం ఎట్లావున్నా అమ్మ మాత్రం శాశ్వితంగా కన్ను మూసింది. ఈ లోకంలోని మంచిచెడ్డలనీ ఇరుగు పొరుగువారి సూటిపోటీ మాటల్నీ కాలదన్ని ఏ అమర లోకానికో వెళ్ళిపోయింది అమ్మ! కాని పండంటి కాపురం నాశనమయిపోతే చూసి సంతోషించే ఈ సంఘంమీద మాత్రం దెబ్బతియ్యాలి. తిరుగు బాటు చెయ్యాలి. నాన్న జైలుపాలయ్యాక అమ్మను పొడిచి పొడిచి, మనస్సును గాయంచేసి, ఆమె మంచమెక్కే లాగు చేసి, చివరకు ప్రాణంతీసింది ఈ సంఘం. ఈ సంఘానికి ఎదురుతిరిగి, తిరుగుబాటు చెయ్యాలి. నాలాంటి అదృష్టహీనుల్నీ చేరదీసి, సంఘానికి నీతి మార్గం చూపించాలి. ఇదే నా ఆశయం. ఈ ఆశయం కోసమే పాటుబడతాను. కాని అమ్మ! అమ్మ, ఈ సంఘముయొక్క నీచమయిన మాటలు పడలేక ఆత్మాభిమానంతో ఈ లోకాన్ని విడిచి పోయింది. అమ్మా! (కుర్చీలో కూలబడతాడు)

[తలుపు చప్పుడవుతుంది. తలుపు తీస్తాడు. ఒక బికారి లోపలికి వస్తాడు. మొదట సందేహించి తరువాత లోపలికి రమ్మంటాడు.]

ప్రకా:- ఎవరయ్యా నువ్వు ? నాతో ఏంపని ? ఇక్కడికి ఎందుకు వచ్చావ్ ? ఏమన్నా దోచుకుందామనా ?

బికా:- జీవితంలో దెబ్బతిన్న వ్యక్తిని. సంఘాన్ని మభ్యపెట్టి దోచుకుందామని ఆశించి, నేనే దోచుకోబడ్డాను. యింకా ఎవర్ని దోచను బాబూ !

ప్రకా:- అయితే ఎందుకొచ్చావ్ ? ఎవరునువ్వు ?

బికా:- నా కన్నబిడ్డలకోసం చితికిపోతున్న కాపురాన్ని స్వర్గ తుల్యం చేద్దామని, సంఘంమీద దెబ్బతీద్దామనీ, దొంగనోట్లు చలామణిలోకి తెచ్చి, పట్టుబడి పరారీ అయినాను. ఇప్పుడయినా గుర్తుపట్టావా ప్రకాశం.

ప్రకా:- దొంగనోట్లు మీరు చలామణిలోకి తెచ్చారా ! మీరు...రామకోటిగారా ! సుజాత, రాజారాం తండ్రి మీరేనా !

బికా:- అవును భయపడకు. సంఘంమీద నాకు గౌరవం పోయింది. నామీద సంఘానికి గౌరవంలేదు సరిగదా, నన్ను వుచ్చులోవేసి బిగించింది. అన్ని విషయాలూ నాకు తెల్సు. నాకు ఈ జీవితంలో మరేకోరికా లేదు. ఈరోజున పోలీసుల వశమవుతాను. కాని ఒక్కటే కోరిక. దానికి నీ సాయం చాలా అవసరం.

ప్రకా :- నా సాయమా-మీబదులు నేను జైలుకుపోవాలా?

బికా:- పిచ్చివాడా ! జైలుకుపోవటం అంత తేలికకాదు. వెళ్ళి బయటపడటమూ తేలికకాదు. ఆ విషయాలు వదిలెయ్యి.

ప్రకా:- మరి ?

బికా:- ఏ పిల్లలకోసం, ఏ నాచిట్టితల్లి సుజాతకోసం, ఒక్కగా నొక్కకొడుకు రాజారాం కోసం, ఇంత ఘోరమైన పనిచేసి నికృష్టజీవితాన్ని గడుపుతున్నానో, ఆ కన్న బిడ్డలకోసం యిట్లా వచ్చాను. (కన్నీరు పెట్టుకుని) నే చేసిన ఘనకార్యానికి, తను లోకాపవాదు భరించ లేక నా సీత ఆత్మహత్య చేసుకుంది. జీవచ్ఛవంలా బ్రతికున్న నేను ఆ తల్లి లేని పిల్లల్ని, నా కన్న బిడ్డల్ని కరువుతీరా, కళ్ళారా చూడాలి. బాబూ! ప్రకాశం! యిదేనయ్యా నా కోరిక.

ప్రకా:- దానికి నేచేసేదేముంది.

బికా:- ఉన్నది. అంతా నీ చేతుల్లోనే వున్నది. నువ్వు తప్పక సహాయం చెయ్యాలి.

ప్రకా:- ఏం చెయ్యాలి.

బికా:- నీ గదిలో నాలుగు రోజులుంటాను. ఇక్కడికి నా బిడ్డలు తప్పక వస్తారు. ఒక్క సంగతి, బాబూ! ఈ బికారి, నికృష్టజీవితం గడిపిన ఛండాలుడు, పాపి, దోషి తమ కన్నతండ్రని మాత్రం వాళ్ళ లేతమనస్సులకు తెలియకూడదు. అదే నా కోరిక. మళ్ళీ అయిదో రోజున నే వెళ్ళి పోలీసులకి నా అంతట నేను వశ మవుతాను. నాకు పారిపోవాలని ఏ మాత్రం కోరిక లేదు. నా నేరానికి తప్పక శిక్ష అనుభవిస్తాను. కాని నా బిడ్డల్ని చూడాలి.

ప్రకా:- పోలీసులకు తెలిస్తే ?

బికా:- నీకా భయం అక్కర్లేదు. ఈ విషయం బైటికి ఏమాత్రం పొక్కనివ్వను.

ప్రకా:- సాధ్యమవుతుందా ?

బికా:- తప్పక సాధ్యమవుతుంది. ప్రకాశం ! నీకు పుణ్యముంటుంది. పెద్దవాడ్ని, నేరస్థుడ్ని, న్యాయస్థానంలో శిక్షింపబడబోయేవాడ్ని, ఇంక ఈజీవితంలో మీా ఎదుటకుగాని, నా కన్నబిడ్డల ఎదుటకుగాని, వంచించి నన్నీస్థితికి తెచ్చిన ఈ సంఘం ఎదుటకుగాని ఇక ముందు రాను. ఈ పాపిష్టి జీవితాన్ని అంతం చేసుకుంటాను. తప్పక అంతం చేసుకుంటాను. నా ఆఖరి కోరిక ఇదొక్కటే తీర్చమని వేడుకుంటున్నాను.

ప్రకా:- ఆత్మహత్య చేసుకుంటారా !

బికా:- అది తరువాత సంగతి. ప్రకాశం ! వప్పుకో. (చేతులు పట్టుకుని) యివి చేతులుకావు, కాళ్ళు. నా జీవిత చరమాంకంలో, నా కన్నకొడుకు యీాడుగల నిన్ను, వాడి స్నేహితుడవయిన నిన్ను వేడుకుంటున్నాను. కాదనకుబాబూ ! నా కోరిక తీర్చి నన్ను క్షమించు. నా చిట్టిపాపల్ని నా కళ్ళారా చూసుకునే అవకాశం కలుగచెయ్యి. కాని ఏ పరిస్థితిలోనూ ఈ తుచ్ఛుడు వాళ్ళ కన్నతండ్రి అనిమాత్రం తెలియకూడదు. ప్రకాశం ! వప్పుకోనాయనా !

ప్రకా:- (కన్నీరుతో) అట్లాగేనండి తప్పక చేస్తాను. వాళ్ళు వచ్చినపుడు యిటు తిరక్కుండా గోడవైపు చూస్తూ

కూర్చోండి. తతిమ్మా విషయాలు నే చూసుకుంటాను కాని ఏ పరిస్థితుల్లోనూ మీరు మాట్లాడవద్దు.

బికా:- అట్లాగే బాబూ!

ప్రకా:- (వాకిట్లోకి చూసి) అదుగో సుజాత వస్తున్నది.

[బికారి కుర్చీలో కూర్చుంటాడు. ప్రకాశం తలుపుతీసి పక్కన నిల్చుంటాడు. సుజాత వస్తుంది.]

ప్రకా:- రా సుజాతా రా! ఏమిటి విశేషాలు? యిట్లా వచ్చావేం? రా కూర్చో.

సుజా:- ఏమిటో తడబడుతూ మాట్లాడుతున్నావే. మీ నాన్న గారి సంగతి ఏమైనా తెల్సిందా? వారు పట్టుబడ్డారా?

ప్రకా:- ఎప్పటికయినా అంతా పట్టుబడేవాళ్ళే. చేసుకున్న ఖర్మ అనుభవించక తప్పదుగా. సరేగాని బాగా చదువుకుంటున్నావా?

సుజా:- ఆఁ.

ప్రకా:- మీ నాన్నగారి విషయం ఏమయినా తెల్సిందా?

సుజా:- నాకేం తెలియదు. కాని పరారీలో వున్నట్లు వినికిడి. ప్రకాశం! సాంఘిక మర్యాదలకు అతిగాపోయి, సంఘంయొక్క ఆంతర్యాన్ని గ్రహించలేక చేసిన అప్పులు వడ్డీలతోసహా తీరక, గత్యంతరం లేక సంఘం మీద దెబ్బతియ్యబోయి, తనే సంఘం విధించిన శిక్షకు గురయ్యాడు మా నాన్న. ఎక్కడున్నాడో, ఏం అగచాట్లు పడుతున్నాడో ఎవరికి తెలుసు.

వంచకులు. కాని పిల్లలు పసివాళ్ళు. ఒకరినొకరు అర్థం చేసుకునికూడా, అర్థంలేకుండా మాటలు పెంచుకునే ఆవేశ పూరితులు. మీరంతా ఎట్లా జీవితాలు గడుపుతారయ్యా ప్రకాశం!

ప్రకా:- నన్ను క్షమించి, మీరు వెళ్ళిపోండి. నా హృదయం పగిలిపోతున్నది. మనస్సు రగులుతున్నది.

బిచ్చ:- ఆవేశాలు చాలా అనర్థకాలకు దారితీస్తాయి. కొంచెం తమాయించు బాబూ! నా చిట్టితల్లి సుజాత హృదయం నాకు తెల్సు. ఈనాటికి దాని నోటిమీదగా హృదయంవిప్పి చెప్పింది. సుజాతది పిలిస్తే పలికే హృదయం బాబూ! జగన్నాథం విషయం యిదివరకే దానికి తెలుసు.

ప్రకా:- దయచేసి వెడతారా, పోలీసుల్ని పిలవమంటారా!

బిచ్చ:- మీ తండ్రి ఈ పరిస్థితుల్లో వుంటే పోలీసుల్ని పిలుస్తావా? అయితే పిలు.

ప్రకా:- రామకోటిగారూ! నన్ను బాధ పెట్టకండి. మా నాన్న మీమాదిరి, అబ్బా! ఎక్కడున్నారో! ఏం చేస్తున్నారో! ఏమిటీ వైపరీత్యం. ఏమిటీ ఆందోళన! అబ్బా! నాన్నా!! (కుర్చీలో కూలబడతాడు.)

[లైట్లు సన్నగిలి మళ్ళీ వెలుగుతాయి.]

[తలుపు చప్పుడవుతుంది. బిచ్చారి కుర్చీలో కూర్చుంటాడు. ప్రకాశం తలుపు తీస్తాడు! రాజారాం ప్రవేశిస్తాడు]

రాజా:- (ప్రకాశం వైపు ఎగా దిగా చూసి) ఏమి ట్రా ప్రకాశం ఖంగాళుగా అదోమాదిరిగా వున్నావ్! ఏం జరిగిందేమిటి?

ప్రకా:- జీవితం చాలా విచిత్రమయిందిరా. తను ఆశించిన విషయం జీవితంలో యింక జరగదని, నిశ్చయంగా తేలినప్పుడు, ఆ వ్యక్తి మనస్సు ఎట్లావుంటుందో ఆలోచించావా?

రాజా:- ఎట్లా వుంటుంది. పేక మేడ మాదిరి కుప్పున కూలిపోయినట్లనిపిస్తుంది.

ప్రకా:- ఎంత తేలిగ్గా చెప్పావురా!

రాజా:- తేలికగాక నువ్వేం బరువులు మోస్తున్నావా?

ప్రకా:- ఒక్క విషయం. నీ జీవితంలో నువ్వు ఆశించనిది, అంటే, తాత్కాలికమయినదే అనుకో, అనుకోకుండా సమకూరితే నీ మనస్సు ఎట్లా వుంటుందిరా?

రాజా:- మానాన్న యిప్పటికిప్పుడు కనిపిస్తే ఎంత ఆనందంగా, సంతోషంగా వుంటుందో, అట్లా వుంటుంది.

[రాజారాం చూడకుండా బికారి కన్నీరు పెట్టుకుంటాడు. ప్రకాశం మాత్రం అతని ఆవేదన అర్థం చేసుకుంటాడు.]

ప్రకా:- ఒకవేళ మీ నాన్న నీకు కనిపిస్తాడనుకో, ఆయన చేసిన ఘనకార్యానికి హర్షించి ఆదరిస్తావా?

రాజా:- ప్రకాశం! ఎంతవూరుకున్నావురా! మనిద్దరం ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నాం. నా పరిస్థితిలోనే నువ్వుంటే ఏం చేసేవాడివి?

ప్రకా:- అలాంటి అవకాశం నాకు దొరకలేదుకదా. నీకు దొరికితే ఏం చేస్తావురా ?

(వద్దన్నట్లుగా బికారి ప్రకాశానికి సౌంజ్ఞ చేస్తాడు)

రాజా:- నా తండ్రి నేరస్థుడయినా, దోషి అయినా, జైలులో వున్నా, పరారయినా, నా తండ్రి నా కన్న తండ్రే ! నేను వారి కుమారుడినే. కన్న తండ్రిమీద వుండ వలసిన ఆదరాభిమానాలు ఎప్పుడూ వుండనే వుంటాయి. ఆఁ ! సరే ! నాసంగతికేం గాని, మరి నీ సంగతో ?

ప్రకా:- ఆ విషయం యిప్పుడెందుకులే. జీవితంలో ప్రతి మానవుడూ తానేదో ఘనకార్యం చేద్దామనే ఆశిస్తాడు. రోజులు కలిసొచ్చినంతవరకూ ఎవరూ ఏం చెయ్య లేరు. ఏమంటావ్ ?

రాజా:- నిజమే. ఎప్పుడో ఒకప్పుడు చస్తామని అందరికీ తెల్సు. కాని నా యిల్లు, నా వాకిలి, నా భార్యా పిల్లలు అని ప్రేమానుబంధాలు పెంచుకోకపోతే, ఆ జీవి, ప్రపంచంలో ఎట్లా జీవిస్తాడు చెప్పు. అందుకనే ఆశకు మితంలేదు, ఆలోచనలకు అంతులేదు.

ప్రకా:- మానవ నైజమే అటువంటిది. సరేగాని, ఒక్క సంగతి.........

రాజా:- ఏమిటది ?

ప్రకా:- (సందేహిస్తాడు)

రాజా:- చెప్పరా !

ప్రకా:- నువ్వేమీ అనుకోవుకద !

- ఏడిశావ్‌గాని, విషయం చెప్పు.
(సందేహిస్తూ) సుజాత........
- ఆఁ. సుజాత........సుజాతకేమయింది ?
- జగన్నాథాన్ని ప్రేమించింది కదూ !
- (నవ్వి) చాలా పెద్ద ప్రశ్న వేశావురా !
- (నిట్టూర్చి) పోనీలే. యిష్టంలేకపోతే చెప్పకు.
- ఈ విషయంలో దాచవలసిన అగత్యం ఏమీ లేదు. వారిద్దరూ పరస్పరం ప్రేమించుకున్న విషయం యదార్థమే. కాని వారి ఆశయం సిద్ధించే అవకాశం యిప్పట్లో కలిగేటట్లు లేదు.
:- కారణం ?
- మా నాన్న ఎక్కడున్నారో, ఏమయ్యారో, ఏ పరిస్థితుల్లో వున్నారో మాకు తెలీదు. ఆయన అనుజ్ఞలేంది వారిద్దరూ తొందరపడరు.

[భికారి "బాబూ" అంటూ ఆవేదనతో నెమ్మదిగా లేచి "సుజాత పెళ్ళి దాని యిష్ట ప్రకారమే చెయ్యి" అని గాభరాగా తొందరగా అనేసి వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోతాడు. ప్రకాశం ఆశ్చర్యంగా, రాజారాం ఖంగారుగా చూస్తారు.]

:- ఎవర్రా ఆ బికారి ? యిందాకటినుంచీ ఈ గదిలోనే వున్నాడా ? యింతసేపూ నేను చూడనే లేదే. మాట, పలుకూ లేకుండా యిక్కడే వున్నాడురా? సుజాత పెండ్లివిషయం అతనికెందుకు? మాట్లాడవేంరా ప్రకాశం !

ప్రకా:- జీవితం ఒక నాటకరంగం. అందులో ఆయన ఒక పాత్రధారి.

రాజా:- ఎవర్రా ఆయన!

ప్రకా:- ఆయనొక స్వాములవారు. నాలుగు రోజులనుంచీ నా ఆతిథ్యంలోనే ఉంటున్నారు. యింతకన్న వేరే చెప్పలేను.

రాజా:- నువ్వేదో దాస్తున్నావ్, నిజంగా యింతకన్న తెలీదా? స్వాములవారయితే సుజాత విషయం ఎట్లా తెలుసు!

ప్రకా:- నన్ను మరింక ప్రశ్నించకు. నాకు బుర్ర వేడెక్కుతున్నది. కాస్త విశ్రాంతి తీసుకోనీ. (కుర్చీలో కూర్చుంటాడు)

[జగన్నాథం, సుజాత వస్తారు]

ప్రకా:- (వారిద్దర్నీ చూసి) కాబోయే దంపతులకు నా సుభాసీస్సులు. కులాసాగా వున్నావా. జ్వరం తగ్గిందా జగన్నాథం?

[అంతా ఆశ్చర్యపోయి ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు]

జగ:- కులాసాగానే వున్నా ప్రకాశం! మీ నాన్నగారు ప్రస్తుత పరిస్థితుల్లోకి వచ్చాక నిన్ను చూడలేదు. నన్ను క్షమించు.

ప్రకా:- అందర్నీ భగవంతుడే క్షమించటమో, శిక్షించటమో చేస్తాడు. నువ్వూ, నేనూ అనుకుంటే అవుతుందా!

సుజా:- ప్రకాశం! ఏదో మనిషివి మారి పోయి దిగులుగా వుంటున్నావే! ఏమయినా సుస్తీగా వుందా?

ప్రకా:- అసలు నా జీవితమే సుస్తీ జీవితం. వేరే సుస్తీ ఎందుకు! జీవితంలో వాంఛించినది ఏదీ జరగలేదు. యింతకన్న సుస్తీ ఏం కావాలి.

రాజా : ప్రకాశం! యిటు చూడు.

ప్రకా : ఏమిట్రా?

రాజా : ఇందాక నీవొక ప్రశ్న వేశావ్ గుర్తుందా!

ప్రకా : ఏమిటది?

రాజా : ఒకవేళ మీ నాన్న కనుపించాడనుకో, ఆయన చేసిన ఘనకార్యానికి హర్షించి ఆదరిస్తావా అని అడిగావ్ గుర్తుందా?

ప్రకా : అవును గుర్తుంది.

రాజా : అదే సందర్భం నీకు కలిగితే?

ప్రకా : అంత అదృష్టంరా నాకు. మీలాంటి అదృష్టవంతుడ్ని కాదు నేను.

రాజా : ఎందుకని?

జగ : అట్లా ఎన్నటికీ కాదు.

ప్రకా : రాజా! నువ్వు నీ తండ్రిని కళ్ళారా చూడగలిగావ్‌రా? కానీ నాకా అదృష్టం యిప్పట్లో లేదు.

రాజా : నీ మాటలు నా కర్థంకావటంలేదు. నా తండ్రిని నేను కళ్ళారా చూశానా? ఎప్పుడు?

సుజా : ఎక్కడ ప్రకాశం ?

ప్రకా : యిక్కడే, యిందాక నువ్వు చూసిన ఆ బికారి కాదు కాదు స్వాములవారు మీ తండ్రి. ఆ రోజున సుజాత చూడలేకపోయింది. నువ్వు చూశావ్.

సుజా : నాన్నని చూశావా అన్నయ్యా! నాతో చెప్పలేదేం?

రాజా : నాకు తెలియందే నాన్న అని. ప్రకాశం! ఎంత మిత్రద్రోహివిరా నువ్వు. మా నాన్నని నీ గదిలో వుంచే, చెప్పలేదుకదూ, ఎంత కటికగుండెరా నీది. నాన్నా ! మాతో మాట్లాడకుండానే వెళ్ళిపోయావా! (తల బాదుకుంటాడు)

ప్రకా:- క్షమించండి. ఆయనే వద్దన్నారు. నేను వారిని దాయ లేదు. ఆ స్థితిలో వారు మీ ముందుకు రాలేక కుమిలి పోయి, నన్ను యీ పరతుకు వప్పించి, ఆ కుర్చీలో కూర్చుని తన కన్నబిడ్డల్ని కళ్ళారా చూసుకుని, వారికి తనయందుండే గౌరవాన్ని, మీ హృదయపూర్వక మైన మాటలద్వారా విని, ఉప్పొంగిపోయి వెళ్ళిపో యారు. వారి హృదయం కుదుటబడ్డది. ఆ స్థితిలో వున్న ఆయనకు అంతకన్న ఏంకావాలి. కాని, నాకూ అంతటి అవకాశం కలుగుతుందంటావా రాజా!

సుజా:- నన్ను చూశారా మా నాన్న! ఏం ప్రకాశం! ఎప్పుడు చూశారు?

ప్రకా:- మొన్నటి రోజున నువ్వొచ్చినప్పుడు, ఆ కుర్చీలోనే కూర్చున్నారు. నువ్వు వార్ని చూడలేదు.

సుజా:- పాపిష్టిదాన్ని నిన్ను చూడలేదు నాన్నా! అన్నా ప్రకాశం! ఎటువంటి సంఘటనలు కలుగచేశావయ్యా నువ్వు! నాన్నా! (కన్నీరు పెట్టుకుంటుంది)

జగ : ఎందుకు సుజాతా! ఏడువకు. ప్రకాశానికి మొండి ధైర్యం జాస్తి. అలాంటి ధైర్యం మనకు నాస్తి. ప్రకాశం!

ప్రకా:- ఏమిట్రా ?

జగ :- మీ నాన్నని........

ప్రకా:- ఆఁ మా నాన్నని...

సుజా:- (కళ్ళు తుడ్చుకుని) మేం చూశాం.

ప్రకా:- మంచిదేగా. ఒరేయ్! ఈ కల్లిబొల్లి మాటలతో నన్ను వంచించలేరు. ఒకవేళ చూసినా, మనోనిబ్బరం లేదు మీకు. పోలీసులకు తెలిస్తే ప్రమాదమని తెల్సి కూడా, తన కన్నబిడ్డల్ని కళ్ళారా చూస్తానని మీ నాన్న వాపోతే ఈ గదిలో ఆతిథ్య మిచ్చాను. కాని మా నాన్న కనబడితే ఆ విధంగా మీరెన్నటికీ చెయ్యలేరు.

రాజా:- ప్రకాశం! అసలు ఆ విషయమే నేను చెప్పుదామని వచ్చా. కాని మధ్యలో ఈ సంఘటనలు జరిగినయ్యి.

ప్రకా:- అంటే ?

జగ:- మీ నాన్నగారు మా గదిలోనే నాలుగు రోజుల నుంచీ ఆతిథ్యం తీసుకుంటున్నారు.

చేసుకుని, నా నేరానికి పూర్తి శిక్ష అనుభవించటానికి మళ్ళీ నాఅంతట నేనే, బహుశా ఈ ఉత్తరం నీచేతిలో పడేసరికి పోలీసులకి వశమవుతున్నాను. నేను పరమ దుర్మార్గుడనయినా, రక్తస్సుర్శవల్ల, నామీద కొంచ మయినా గౌరవం వుంచుతావు కదూ! బాబూ! యింక నన్ను మర్చిపో. బాధపడకు.

ఇట్లు,
నీ పాపిష్టి తండ్రి.

[ఉత్తరం పూర్తిచేసి] నాన్నా! నే నెంత నిర్భా గ్యుణ్ణి. నిన్ను చూడలేకపోయాను. నన్ను చూడ కుండా మళ్ళీ జైలుకు వెళ్ళిపోయావు కదూ! ఎందు కిట్లా చేశావు? ఎందుకు నాకీ శిక్ష. నాన్నా! [తల బాదుకుంటాడు.]

రాజా:- ప్రకాశం! ఏమిట్రా యీపిచ్చి. మా విషయంలో యింత ధైర్యసాహసాలు చూపించినవాడివి, అంత లోనే యింత కుప్పగా కూలబడితే ఎట్లారా?

జగ :- ప్రకాశం! వాళ్ళ తండ్రి యిక్కడికివచ్చి నీ గదిలో వున్నప్పుడు వాళ్ళేం చూసి సంతోషించారు చెప్పు, నువ్వు నీ తండ్రిని చూడలేదని బాధపడటానికి. వాళ్ళ తండ్రికి తన బిడ్డల్ని కళ్లారా చూసుకునే యోగ్య తయినా కల్పించావు. కాని మేం నీకు ఆ మాత్రం అవకాశమయినా కల్పించలేదు. అందుకు మేం విచా రిస్తున్నాం.

సుజా:- నిజమే మేమే కఠినాత్ములమైపోయాంగాని నువ్వు మాకు చాలా సహాయం చేశావు. కాని ఆఖరు క్షణంలో అంతా తారుమారయింది.

రాజా:- అవును ప్రకాశం. మాకేం శిక్ష విధిస్తావో విధించు. కళ్ళ యెదుట కన్న తండ్రి వున్నా, చూసుకోటానికి నోచుకోలేని దౌర్భాగ్యులం మేము. దగ్గరలో వున్న తండ్రిని చూడలేకపోయిన నిర్భాగ్యుడివి నువ్వు.

ప్రకా:- అవును. కన్నతండ్రి ఎదురుగావున్నా కళ్లారా చూడ టానికి నోచుకోలేని దౌర్భాగ్యులం మనమే. పందిరి గుంజలమాదిరి పనికిమాలినవాళ్ళంగా తయారయాం.

జగ :- పందిరిగుంజలు సరిగ్గా నిలబడగలిగితే వాటిని ఆధారం చేసుకుని వున్న పందిరివల్ల అందరికీ చల్లని నీడ లభిస్తుంది.

రాజా:- నిజం చెప్పావురా. పందిరిగుంజలకన్నా విలువ వున్నదిగాని ఈ దౌర్భాగ్యులకు మాత్రం విలువలేదు సరికదా, అందరి దృష్టిలోనూ, నీచంగా చిత్రించబడే నిర్భాగ్యులం అయాం.

సుజా:- జీవితాలు శాస్వితమని భావించి, కన్నబిడ్డల కోసం కాని పనులు చేశారు మన పెద్దవాళ్ళు. చివరికి వాళ్ళూ, మనమూ అశాస్వితమయినా, ఈ మచ్చ మాత్రం శాస్వితంగా వుండిపోతుంది.

[ తెర ]

[సమాప్తం.]

# గీతాసుందరి

[ కావ్య సంపుటి ]

రచన : "హారికిషన్"



## "ప్రణయ సుందరి"

నా జీవితపథాన రథాన నిను
కూర్చుండ జేసి నే సారథినై
మన ప్రణయరథమ్ము తోలగ
హాయిగ కూర్చొని పాటపాడవె!

ప్రణయకోపముచేత నీ
నవరసభరితపూ పల్కులోన
చిరుకోపము పెదవుల చిందులాడ
నా గుండెలు గుభిల్లనుచు కొట్టుకొనె నెంతలోనె!

నీ సుందర సురుచిర సుమధుర
సంభాషణలతోడ ఈ సుధాంబుధిపైన
హాయిగ నే మరచి వినుచుండునటుల
కలికీ! ననుకరుణించి కావగరావె!

తరుణికో తరతరాలుగ ఈధరణిలోన
తరగనిధనరాసులనెల్ల వెతజల్లి
రాకుమారులుసైతము రమణులప్రేమకొరకు
రాచరికముసైతము విడిచిరకట !

నీ మందస్మిత మధుర దరహాసచంద్రికా
విలాసమయ సుమధురవీక్షణముకొరకు
తల్లిదండ్రులనుగూడ వదలినేను
రమణీ ! నీచెంతజేరితి నన్నుపల్కరించవా !

రాజ్యమేలేదు నేరారాజుకాను
కవితాకన్యలేదు నేకవినిగాను
ప్రణయసామ్రాజ్యపట్టాభిషిక్తుడై
నిన్నేలుకొందునే నాదుపట్టమహిషిగ !